

Published by

**Karra Atchayya & Sons.**

*Book-Sellers,*

RAJAHMUNDRY.

 1927 (Price Re.0—12—0

# LANKA DAHANAM



By

Ch. Manikyasarma Garu.



# కన్యాశుల్కము.

ఇది ఆంధ్రభాషలో చక్కనిహాస్యరసప్రధానమగు నాటకము. దీనినిగురించి తెలియనివారును కొనియాడనివారునుండరు. దీనినిచాలాచోట్ల ప్రదర్శించియున్నారు. ఆంధ్రభాషలోనిట్టిగ్రంధము వేరొకటిలేదని చెప్పవచ్చును. కొలదిప్రతులుమాత్రమె ముద్రించితిమి. ఇందలి గిరీశముయొక్క మాటలు చర్యలు చదివిచూడవలసినదేకాని యిచ్చట వ్రాయుతరముకాదు. గ్రంధకర్త, శ్రీగురజాడఅప్పారావుపంతులుగారు.

వెల రు. 1—0—0

# రసపుత్రవిజయము.

చక్కనివీరరసప్రధానమయిననాటకము, అనేకచోట్లప్రదర్శించినది. కొలదిప్రతులుమాత్రమే ముద్రించియున్నాము. గ్రంధకర్త, ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణశాస్త్రిగారు.

పోస్టేజీ వుచితము వెల రు. 1—0—0.

# జానకష్ణలీల.

జ్ఞానముబోధించు చక్కనినాటకము. భగవద్గీతలోనిసంగతులతోను నీతిబోధకమయినది. భీష్మనిర్యాణముకూడ యిందుగలదు. గ్రంధకర్త, పండిత. కె. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

వెల రు. 1—4—0

అరేబియన్‌నైట్సు (చక్కనికథలు ( 1వ భా॥ క్యాలికోబైండు

వెల రు. 1—8—0

డిటో 2 వ భాగం రు. 1—8—

బుక్సెల్లరు.

రాజమండ్రి.



మొదటికూర్పు 1,000 ప్రతులు.

శ్రీ సీతారామాంజనేయముద్రాక్షరశాలయందు ముద్రితము.

రాజమహేంద్రవరము.

1927

---



[వెల 0—12—0

శ్రీరస్తు.

# లంకాదహనము.



గ్రంథకర్త.

చక్రావధానుల మాణిక్యశర్మగారు.

పబ్లిషర్సు

కర్రా అచ్చయ్య అండు సన్సు.

# ఈ నాటకమునందలి పాత్రలు.



పురుషులు.

1 రాముడు—దశరథుని పెద్దకుమారుడు.

2 లక్ష్మణుడు—రాముని తమ్ముడు.

3 రావణుడు—లంకకురాజు

4 హనుమంతుడు—సుగ్రీవుని మంత్రి.

5 సుగ్రీవుడు—వానరరాజు.

6 మారీచుడు—రావణుని మేనమామ.

7 వాలి—సుగ్రీవుని అన్న

8 అంగదుడు—వాలికొడుకు.

9 శంబరుడు—రావణుని మంత్రి.

10 అకంపనుడు—రాక్షససేవకుడు

11 ఇంద్రజిత్తు—రావణునికుమారుడు

12 విభీషణుడు—రావణుని తమ్ముడు

స్త్రీలు.

సీత—రాముని భార్య.

తార—వాలిభార్య

శూర్పణఖ—రావణుని చెల్లెలు.

లంక—లంకనుకాయురాక్షసి.

రక్తాక్షి, శ్వానముఖి } సీతనుకావలికాయుస్త్రీలు.

ధాన్యమాలిని—రావణుని సేవకురాలు.

త్రిజట—రాక్షసస్త్రీ.

ఇంకను సందర్భానుసారముగా భటులు, మునికుమారుడు, దీర్ఘనాసుడు, మొదలగుననేకులువత్తురు.

శ్రీ

# లంకాదహనము.



ప్రథమాంకము.



రంగము—వెదురుపొదలోనున్న ఆశ్రమస్థలము

(లక్ష్మణుడు ప్రవేశించును)

లక్ష్మ॥ గీ॥ రామవనవాస మనునక్ష • రంబులేదు।
నన్నులేడాచునాహృద • యంబుమిగుల।
గాల్పజొచ్చెడు దుర్భర • కష్టసమితి।
జిక్కినవయుచునుంటిమి • దిక్కులేక॥

కటకటా; చిత్రకూటమువిడచి దండకారణ్యమున బ్రవేశింపగనే జానకీదేవివిరాధునిచే హరింపబడనామెనురక్షింప మేముద్యమించుతఱి మమ్మిరువుర రెండు చేతులగబళించినప్పుడు మాహృదయము లెట్లుండునో దైవమునకెఱుక. అప్పుడు సాహసించివానిబాహువులనఱికిబైలుపడితిమి. ఇట్టియిక్కట్టులిక ముందెన్నిసంభవించునో తెలియదు. (ముందుచూచి) ఔరా! ఏమి యాశ్చర్యము; ఈవెదురుపొదచెంత నిరాధారముగ వ్రేలాడుచంద్రాయుధమెందుండివచ్చెనో అయిననేను దీనినేల గ్రహింపరాదు. (ఆయుధముం జేకొని చెట్లనఱకును)

(మునికుమారుడు ప్రవేశించును)

మునికు॥ లక్ష్మణా ! వ్యర్థముగనీపుష్పభరితము లైనకొమ్మలనేలనతికె దవు. ఆ వెదురపొదనఱుకుము— (నిష్క్రమించును)

లక్ష్మ॥ మునిపుత్రుని వాక్యమునకు ప్రయోజనములేకపోదు. (పొదన ఱుకనందుండి తాపసుని నఱుకబడిన శిరముపడును.) అన్నన్నా? నిష్కారణమా కై తవమునిబాలకుని మాటబాటించి బ్రహ్మ హత్యకులో నైతినికదా ; ఆదుష్టుఁడు రాక్షసుడైయుండ నోపు. లేకున్నా నాచే నిట్టిఘోరకృత్యమును జేయించునా!

చ॥ శివశివబ్రహ్మహత్యయొడి ♦ శేజెనురా ముడు విన్న నెట్టిక్రూ రవిధినిశిక్ష జేయునోత్వ ♦ అంపడియామువి మాటనేలవిం టివి ? నివిమర్శనేయకక ♦ టికు్కనపొద ద్రుంపనేల; ఖ డ్గవిదళితోత్తమాంగముహా ♦ తాత్తుగ వెల్వడనేల దైవమా !

నేనిక్కడనెంతతపించిన నేమిఫలము. మాయన్నగారితో జెప్పిమహా ఘలయానతిశాంతిక్రియలు సేయించుకొందునుగాక.

(నిష్క్రమించును)

శూర్పనఖ:— (ప్రవేశించి) నాయనా ! జంబుకుమారా? ఇదే, నీకాహార ముగొనివచ్చితి. (ముందుజూచి) హాకుమార! హా! నాకడుపువం టా ; ఈయాశ్రమమున దపోనిష్ఠతోనున్న నిన్నుజంపినదురా త్ముఁడెవ్వఁడురా, తండ్రీ! అయ్యో! నీవుఘోరతపంబుచేసియమో ఘవరంబులం బడసియమర్త్యులగెలిచి దేవలోకమాక్రమించి కొనినీమామ దశకంఠుని కంటెనెక్కుడు కీర్తికాముడవగుదువని పేరాసతోనున్న నాకడుపున జిచ్చువెట్టితివా, కుర్రా ! ఎవరికిని గీడుసేయని నిన్నుజంపుట కాదురాత్మునకేమి చేటుమూడినది. సరే, మంచిది. ఓవనవాసులార, మునులార, అకారణముగనాపు త్రునెవ్వఁడుచంపెనోవేగ జెప్పుడు. లేకున్నమిమ్ముందఱదోటకూ

రకాడలవలె నొక్కసారి నలిపివేసెదను. (ఆలకించి) (తెరలో) శూర్పణఖా; పంచవటీతీరమున బర్ణశాలలో రామలక్ష్మణులను వారున్నారు. అందులక్ష్మణుడు నీకుమారుని జంపినాడు. మేము చంపలేదు.

శూర్ప:—ఓహో, అలాగునా ? సరియే, నేనిప్పుడే పోయి వానిని భక్షించెదను. నాబిడ్డనిజంపినందుకగ తీర్చుకొందును.

(నిష్క్రమించును.)

రంగము—పర్ణశాల.

రాముడు:—రాక్షసులు శేయగుగాక, మాకు నుపద్రవపించు ఏ తపోనిష్ఠులున్న వానినిజంపిన దోషమువాయస్వల్పశాంతి శేయమునుల నెంట లక్ష్మణుని బంపియుంటి. పోయి చాలసేపయ్యెనేమి కారణము చెప్పుమా !

శూర్ప:— (ప్రవేశించిచూచి) ఓహో ; ఈయందగాడెవ్వడు ! ఈతని భువనమోహనాకారమునుజూచి ఎంతోనే కొడుకుపుత్రశోకముపోయి కామవికారమునకు లోనైతిని. పోయి కౌగిలించు కొందునా ! కాదుకాదు, నావికృతాకారమును జూచియూరకడేవరింపదు. కాపురుని మోహానాంగులకప్పైన సౌందర్యమును ధరించెదను.

(నిష్క్రమించును.)

రాము:—ఆవచ్చుజగన్మోహనాంగి ఎవ్వతె రాజా !

(శూర్పణఖ సౌందర్యవతియై ప్రవేశించును.)

శూర్ప:— ఉ॥ సీతరుణీజనాస్తోమ ♦ హోన్నతపుణ్యాఫలంబ; ఆశ్రిత
ప్రాణచకోరచంద్రమ, కృ ♦ పారసభాజన సర్వలోకవి
ఖ్యాతమనోహరాకృతిభ ♦ యాక్తమయాచకురాల స్త్రీనిసం
ప్రీతిగ్రపురమాశగణు ♦ వేడితినీకు నమస్కరించితిన్.

రాము:— కాంతా ! నీభయమును పోనగను. నీవెవ్వతెవు. నీవృత్తమేమి?

శూర్ప:—పోవగలదు! ఎవరివలన; ఇదెట్టియభయప్రదానవరమయ్యా? అగుగాక, మీపేరెయ్యది. ఎవ్వరుమీరు.

రాము:—నేనుఇక్ష్వాకుకులతిలకుండైన దశరథుని పుత్రుడను. రామనాముడను. పితరులయాజ్ఞనిర్వర్తింప భార్యజానకిని తమ్మునిలక్ష్మణునితోడుకొని వనవాసమునకై వచ్చియీటవిడసితిని.

శూర్ప:—ఓహో, నీవేనా రాముడవు. అట్టివంశమునందు జన్మించియిట్టి శుష్కప్రియవాక్కులచే నూఱడించితివి.

రాము:—అదేమి; శుష్కప్రియములు కావే.

శూర్ప:—అటులైన, నిభయమును బోగొట్టెదను" అనివచింపక, పోవగలదు. అనిపలికితివేల?

రాము:—అట్లుచెప్పుటకు నాకుసమ్మతయున్నదోలేదో ఎట్లుచెప్పగలను.

శూర్ప:—ఏమిధీరోదాత్తుఁడవు. ఎట్టియవికత్థనత్వము పోనిమ్ము. నీకుసమ్మతియున్న నాభయమును దీర్చెదవా ?

రాము:—అయ్యదిధార్మికజనాచరణీయమైన దీర్చెదను.

శూర్ప—ఓహోహో, కనుధర్మనిష్ఠకులవాడవే? ఏటబడికొట్టుకొనిపోవువానినుద్ధరించు విషయమును జాతిభేదమునెంచెదవా?

రామ—అప్పుడట్లు సెయనుకాని,? నీవెవ్వతెవు నీపేరెయ్యది.?

శూర్ప—చాలు జాలు, రామా! నీ సరసత్వమంతకంతకువిరసములోనికి మారుచున్నదే? పిపాసాపీడితునకు ముందుగ బానీయమిచ్చి తరువాత బ్రశంసించెదవా లేక ముందుగనే వాని నాల్కలాగుకొనిపోవువరకు మాటలచే గాలయాపనముజేసెదవా?

రామ—ఇప్పుడట్టి యవస్థనీకురాలేదు. నీ గోత్రనామములు చెప్పుము.

శూర్ప—నేను భువన చతుర్దశకమునుజయించి కీర్తిగాంచి దిక్కుల నరిగాపులగా జేసికొనిన దశకంఠుని సోదరిని. నానామము శూర్పణఖయందురు.

రామ—అంతవాని చెల్లెలివైననీకు భయకారణమేమి?

శూర్ప—కారణము నీవే, ఏమందువా!

మ. జగముం గోమోహానముద్రిమందుముసుగఁ ♦ సౌందర్యపుందీవివై
మగువల్ చూచిన వారిదృష్టిబలముల్ ♦ మార్గంబుగఁ జొచ్చి తీ
వ్రగతిం గానసముగ్గిలాచి యువతీ ♦ ప్రాణంబులఁదీయగా
దగినీయార్తికిమూలమేమనెదు వా ♦ దా కామినీ మన్మథా.

రామ—ఓహో! ఆలాగునా, శూర్పనఖా,ఏకపత్నీవ్రతుడనైన నేను
నీయార్తిని నివర్తింపఁజాలను.

శూర్ప—ఏలచాలకుందువు. కేరడములుచూనుము.

1 (పాట) కామినీమనోహరా

నీవునామానోధనమును దస్కరించినావు. మనసులేని శరీరము మానితో సమానమునన్ను బరిగ్రహింపుము.

[లక్ష్మణ సీతలు ప్రవేశింతురు.]

సీత—ప్రాణేశ్వరా! ఈమెయెవ్వరు.

రాము—జానకీ, ఈమె యొక దానవభామిని.

శూర్ప—రామచంద్రా! ఈకుష్మాంగియేనా యేమి, నీభార్య, బలే,
బలుసుకంపను సంపాదించితివి.

సీత—అదేమే, పలుగాకిమాటలాడెదవు.

శూర్ప—వహావ్వా! మగనిమోలల నిట్లుజగడమునకు సిద్ధపడుగయ్యా
ళితో నెట్లుకాపురముసేయుచుంటివోయి రామా!

రాము—ఎట్లోసేయుచుంటి. నాకిమెతగినదియే.

శూర్ప—తగదు, తగదు. ముమ్మాటికి దగదు. నీవెఱ్ఱిమానుము. అది
చెంతనున్నదని జడియకుము. నీవునన్ను గట్టుకొంటివేని నీక
నేక మహోపకారము లొనర్చెదను.

సీ. వరకల్ప వల్లరీ పం ♦ జరమ్ము నెనుజ
క్కించి సౌఖ్యాబ్ధి దే ♦ లించుదాన
సంపూర్ణశారద ♦ చంద్రామృతంబు ద్రా
వించి సంతృప్తిగా ♦ వించుదాన
కనకగిరీంద్రశృం ♦ గముల నెక్కించి వే
లీలల నిన్ను లా ♦ లించుదాన
మదనసామ్రాజ్య సం ♦ పదనిచ్చి క్రీడలా
డించి హాహాయని ♦ పించుదాన
గీ. మించి మోహాబ్ధినోలలా ♦ డించుదాన
పంచశరుబాఱినుండి త ♦ ప్పించుదాన
కేళిపరవశమునను సొ ♦ క్కించుదాన
విపులభక్తిని నిన్ను సే ♦ వించుదాన.

రామ—ఓసీ, నీవెందుల కాసజెందెదవు? చెప్పలేదా! ఏకపత్నీ వ్రతస్థుడనని.

శూర్ప—అట్టి వ్రతమును నీవవలంబింపరాదు. కామాతురుడై ముప్పూర భార్యలను గట్టుకొన్న నీతండ్రికంటె నీవు ఘనుడవా.

రామ—ఆమహాత్ములమాట నీవుత లంపరాదు. నానియమమును నేను విడచువాడనుకాను.

శూర్ప—ఇట్టినియమములెందరో యిదివరకుబట్టి క్రియకు చిప్పలో నసుగువేసి పడతులకు గృహకుంభదాసులై చరించిరి. వారి నామములొక్కసారి వక్కాణింతునా.

రామ—వలదు. అధికప్రసంగము సేయక ఆవలకుబొమ్ము.

శూర్ప—రామా! నీహృదయమేమో దయారసమయమని తలంచితిని కాని కఠినశిలాప్రాయమని తలంపనైతిని. మన్మథార్తికిలోనై నిన్ను శరణంబువేడ నిట్లు నిరాకరించుట ధర్మముకాదు.

[2వ పాట బేలనైతిరా]

రాము—కామినీ, నేను భార్యతో నున్నాడను. సతి నింటవిడచి యొంటిగ వచ్చిననాతమ్ముని లక్ష్మణుని వరింపుము.

శూర్ప—(స్వ) ఇదియునొక మంచియుపాయమే; సవతిపోరు మహాకష్టము (ప్రకాశము) లక్ష్మణా; నీయన్నయాజ్ఞయైనది. నన్ను వరింపుము. నిన్ను దివ్యులను మించినవానిగా జేసెదను.

లక్ష్మ—ఓసీ, రంకులాడీ; నీకాఱుకూతలు నేవినజాలనవలకుబొమ్మ.

శూర్ప—ధూర్తుడా! అమృతమునీకు జేదయ్యెనుగా, ఇంతవిరసమా.

లక్ష్మ—అదియమృతముకాదు. హాలాహలము. ఇకమారుమాటాడితివేని నీ ప్రాణములునీకు దక్కవు.

శూర్ప—ఆలాగునా, అట్లైన రామునేచేపట్టి నీమకురుతనమునుమాన్పెదను (రామునిజేరి) ఏమి, రామా, నీతమ్ముడంగీకరింపలేదు. అగ్రజుని యానతిమీరిన దుండగీడు నీకేమిసాయపడును. నన్ను జేకొంటివేని వానియవసరములేకుండ నేనన్నియు జక్కబెట్టెదను. నన్నేలుకొనుము.

రాము—ఏలుకొనుటకల్ల. వృథాయాసము నందకపొమ్ము.

శూర్ప—(స్వ) ఈతడు భార్యకుజడిసి సంకోశింపుచున్నాడు. దీనిని మ్రింగివేసితినా? అప్పుడనంగుని బాఱికగ్గమై నాపదంబులనే పడును. అయినసింకొకసారి బ్రతిమాలెదను-(ప్ర) రామా! ఆయాసమందక ఆనందము పడు నాశ్రమమునీవు వగచుటచే నాయందభిమానమున్నదని యెఱింగితిని కాని నీపీటకులాడికి బెదరుచున్నావు. ఇట్టినీవు మగవాడవుగా బరిగణింపబడవుసుమా? ధైర్యము దెచ్చికొనుము. నీవొకసారి “ఊఁ” అనిఅంటివేని రూపులేకుండమ్రింగివేసెదను. చివరకు కనుసైగనైన సేయుము.

సీత—ఓసిరాకాసీ అదినీవశమగునటే! సిగ్గులేక వలదన్నను మగవారి పై బడి బ్రతిమాలుచున్నావు. నానాథుని కాగ్రహమువచ్చి నజచ్చెదవు సుమీ?

శూర్ప—ఆ! నీవానేనా చచ్చుట (సీతనుమ్రింగబోవును)

సీత—హాప్రాణేశ్వరా? రక్షించుము! రక్షించుము!

రాము—హా! హా! దూరముననిలువుము (అడ్డగించి) లక్ష్మణా! కామపిశాచగ్రస్తురాలిని దీనిజంపధర్మముకాదు. కాని నాసికనుగోసి వెడలగొట్టుము.

లక్ష్మ—ఓసీ! తుచ్ఛురాల! రమ్ము! నాసికాలంకారముజేసెదను.

(ముక్కునుజెవులునుగోయును.)

శూర్ప—హా! చచ్చితిరా, రాచవిధవా, హా! హా! సోదరులార! ఖరదూషణత్రిశిరులార ఈనరాధములు నాముక్కుం జెవులుగోసినారురా! వేగవచ్చి వీరిమచ్చమాపవలెరా, అయ్యో, ఎంతదుర్మార్గులురా!

[నిష్క్రమించును]

రాము—లక్ష్మణా! ఇపుడురాక్షసులు రాగలరు, నీవుసీతనుదోడ్కొనిపోయి యీపర్వతగుహలో భద్రంబుగ సంరక్షించుము. వధానంతరమున నేనేయచ్చోటకువచ్చెదను.

లక్ష్మ—చిత్తము. అమ్మా, రమ్ము.

[లక్ష్మణసీతలునిష్క్రమించెదరు]

(ఖరదూషణులు ప్రవేశించెదరు)

ఖర॥శా॥ ఏరాతుచ్ఛడ మానవాధమభయం ♦ బింతైనలేకుండగా
శూరత్వంబునమాదుశూర్పనఖము ♦క్కుంగోసినావాడురా
త్మా! రమ్మింక ద్వదీయకాయమునువి ♦ ధ్వంసంబుగావింతు
నా। రౌరారాక్షస సింహశ్మశుప్రులయు ♦ య్యాలూగగా
జూచితే॥

ఇంతకావరమా, రాక్షసులకాహారప్రాయులైనమానవులకునుష్టుడా, నీవేలోకముల జొచ్చినను నా బాణాగ్నికి శలభప్రాయుడవుకాక పోవు. నిలువుము. రణమందు?

దూష॥ అన్నా, ఖరాసురా! ఈమున్నరికంపునరునిజంపనీవు కావలెనా? నేనేవీని యప్పమువలె చప్పరించెద. ఆయుధములు కూడగా వలెనా? ఓరీ, రమ్ము. మ్రింగివేసెదను!

రాము॥ఉ॥ దానవులార ధారుణిన ♦ ధర్మపథాశ్రితులైనమిమ్ములన్
బూనికతో వధించి వన ♦ భూముల నిర్భయమందజేయగా
నేనరుదెంచి నాడవశ ♦ మేయికదైత్యకులంబు నిల్వదో
ప్రాణమునుంత జూపియము ♦ సన్నిధిజేతును నాశరాగ్ని చే॥

(బాణములవదల రాక్షసులు చచ్చెదరు)

ఇక్కడికీదాన వమృక్కటుల జక్కడంచితి. నేనికసీతా లక్ష్మణులగలసికొనవచ్చును కానిహతశేషులైన దనుజులు తమప్రభువునకెఱింగింపకపోరు. వారు పరాక్రమింపకపోరు. కావునభద్రముగ నుండెదను.

(నిష్క్రమించును)





# లంకాదహనము.



## ద్వితీయాంకము

రంగము—సభామంటపము

(రావణుడు శంబరుడు ప్రవేశించెదరు)

రావ॥ శంబరా! విరాధవధానంతరము దానవమనశ్శల్యమైన రాముని వృత్తాంతము మన కేమియు దెలియలేదు. జనస్థానమునకు పదిలముగా నున్నారా! నమురాదుకద!

శంబరు॥ మహాప్రభూ! మీకుంతభయము దావాగ్ని కెన్నడైన నగలుగునా? అందరి క్షేమవార్త నేయకంపను డేకొనివచ్చుచుండును.

అకంపనుడు॥ (ప్రవేశించి) క్షేమవార్త గొనివచ్చునంతటిభాగ్య దశ నాకులేదు.

రావ॥ ఏమది,అకంపనా ! ఏదైనయాపద వాటిల్లెనా, వేగజెప్పుమా?

అకంప॥ ఏమనిచెప్పుదు. రామలక్ష్మణులు చెంతకుబోయిన శూర్పణఖ ముక్కుంజెవులును గోసినారు. అయ్యదితనపరిభవంబుఖరాదులకు దెలుప వారందరు సమరమునకు బోయిరామునిచే సమసిరి. నేనెట్లోతప్పించుకొని మీకీవార్త విన్నవింప వచ్చితిని.

రావ॥ ఔరా,ఎంతటిదుర్దశ వాటిల్లినది. హాసోదరులారా! హాప్రతాపభాస్కరులారా? మదీయప్రాణసమానులారా? మీకందరికొక్కసారి యకాలమరణముసంభవించినదా?అయ్యో!నేనెట్లుబ్రతుకువాడ

(శూర్పణఖ ప్రవేశించి)

శూర్ప॥ అన్నా, రావణ! నీవంటిసార్వభౌమునకు సోదరినైననాక్కనరాధముండు ముక్కుంజెవులు గోయనది వినిఖరాది దానవులువానితోఁబోరి అలుగుమంటలలోఁ హతమారి పోవనీవు సిగ్గులేక అయ్యో!ఎట్లుబ్రతుకుదునని యేడ్చుచున్నావా? ఛీ,నీబ్రతుకు బండలుగాను, నీప్రతాపము మండిపోను, ఎందుకురా, నీవిక్రమముకాల్పనా? ఇదివినుటతోఁడనేదండెత్తిపోయియానరాధములసంహరింపవలదా?

రావ॥ సోదరీ,శూర్పణఖా! నీకుగలిగిన పరాభవమునకే చింతిల్లుచున్నాను. నీవునీముక్కునకు మందువేసికొనుము. నేనువానివధించి వచ్చెదను.

శూర్ప॥ వీలుచిక్కినచో ఆరాముని కట్టితెచ్చి ప్రాణములతో నాకర్పించితివా, అనుదినము వానికిదగిన శిక్షజేయుచు వేధించుచు నాకసి తీర్చికొనెదను. వానిభార్యసీత త్రిలోకసుందరి. ఎట్లు దక్కించికొనెదవో!

రావ॥ మంచిది. అట్లేపొమ్ము. (శూర్పణఖనిష్క్రమించును)
అకంపనా!

గీ. తృణము దుర్భరపవిని భే ♦ దించినట్టుల
చీమపర్వతమును దొలి ♦ చినవిధాన
పిల్లిమృగనాథు బట్టిచం ♦ పిన కరణిని
దూషణాదుల రాముఁడా ♦ త్రుంచువాఁడు.

కావుననేనిప్పుడే సర్వసేనలతో దండెత్తిపోయి యానరాధముల నామావశేషము జేసివచ్చెదను. (లేవబోవును)

అకం॥ రావణా! నీవుదూరమాలోచింపక ఇట్లుత్వరపడుచున్నావు. ఖరదూషణాదుల పరాక్రమము నెఱుంగుదువుగదా? అట్టివారె

రామశరాగ్నిలో తృణప్రాయులై మడిసినారు. రాముఁడనసామా
న్యుఁడుకాఁడు. త్రింశత్కోటిదేవతలతో హరిహరబ్రహ్మేంద్రా
దు లెదుర్కొనినను కనుఱెప్పపాటులో దెరల్చు నఖండప్రతా
పమార్తాండుండు కానిమానవుఁడుకాఁడు. నీవేమాయోపాయము
బన్ని యోవానిదుద ముట్టింపబ్రయత్నింప వలయునుగాని ప్రత్య
క్షముగ నెదిరించిన నీవంటిదశకంఠులు వేయిమందియైనను వాని
చిరుతకోలకైన జాలరు. కావునదగి నట్టులాలోచింపుము.

రావ॥ అట్లైన సరియే, నీవుపొమ్ము. నేనిపుడే మారీచునిమనసుచేనా
కర్షించి యోజించెదను.

అకం॥ మంచిది. (నిష్క్రమించును.)

మారీచుఁడు॥ (ప్రవేశించి) దశకంఠా! నన్నేందులకు దలంచితివి.

రావ॥ మామా, దండ కాటవిలో రాముఁడు ప్రవేశించి ఖరాదులహత
మార్చి జనస్థానమును శూన్యముగ నొనరించినాడట. శూర్ప
నఖ ముక్కుగోసినాడట, ఆతనిబ్రత్యక్షముగనెదిరించుట దుర్ల
భమట, నీవుమాయాకల్పనాధౌరేయుఁడవు. నీశాంబరీవిద్యా
విశేషంబున వానిభార్యనుండి విడదీసిస్థలాంతరమునకు గొంపో
తివేని యాజానకినిదస్కరించు కొనివచ్చెదను. వాఁడుభార్యకై
పరితపించి కానకప్రాణముల బాయును. మనపగదీరును. కావు
ననీవీసహాయముసేతువని తలంచి రప్పించితిని.

మారీచు॥ భాగినేయా; ఆరాముఁడసామాన్యుఁడు. దేవతలకు దేవుఁడు.
నన్నొకబాణంబుచే దూలించివారాశి మధ్యమున నెప్పుడు పడు
నట్లుచేసెనో అది మొదలువాని పేరుగలఅక్షరములపైతముచ్చ
రింపనూనితి. వానిపై బగసాధించుట మృత్యువుతో జెలగా
టమువంటిది. రాక్షసవధార్థమైనారాయణుండు రాముఁడై య
వతరించి నాఁడనిమునులవలనవినియున్నాను. ఇప్పుడైనవానితో

శత్రుత్వమును మానిమిత్రత్వమును బాటించితి వేనియాశ్రిత రక్షకుండగుట చేమనలగా పాపము. లేకున్న సంహరింపకమాన డుకావుననీవీయుద్యమమునుమానుముకులంబునిలుపుకొనుము.

రావ॥ మారీచా, ఏమి ప్రేలుచుంటివి? నాతులుండవుకదా యనినీసహాయముగోఱ నిట్లుపలుకుదువా? ఛీ! ఆనరాధమునితో నాకు మైత్రి యా? నాకిప్పట్టున దోషుపడెద నందువా లేకనాఖరాసిచే జచ్చెదవా? చెప్పుము.

మారీ॥ (స్వ) వీనికిమృత్యు వాసన్నమైనది. కనుకనే నామాటలుచేదైనవి. వీనిచే జచ్చుటంటె రామునిచే జచ్చినమోక్షమైన లభించును. (ప్ర) దశకంఠా: నా హితవ్రలునీకు వెగటైనవి. ముందైనను నామాటల యాధార్థ్యమును నీవుగ్రహింపకపోవు. నేనొకబంగారులేడినై పర్ణశాలా సమీపమున మెలంగెదను. జానకియాలేడిని దెమ్మనిరాముని బంపును. అప్పుడునీయిచ్ఛ వచ్చినట్లు చేయుము.

రావణ॥ మామా! మంచి యుపాయము బన్నితివి. అట్లేచేయుము. పొమ్ము. లక్ష్మణునికూడనాకర్షించుము.

(ఇద్దరునిష్క్రమించెదరు)

రంగము—పర్ణశాల

సీతారాముల ప్రవేశము.

సీత ॥ ఆహా! ఎంతఆశ్చర్యము? ప్రాణేశ్వర, ప్రాణేశ్వర! అటుచూడుము.

ఉ ॥ చెంగున దాటుచున్ బొదల ♦ చెంతను కాంతులనీను హేమసా।
రంగముతారుచుండెనది ♦ రామ గరాలనమించె జుక్కలా।
యంగముమీద దానినెటు ♦ లైనను పట్టియొసంగి తేనియు।
త్సంగము మీద బెట్టుకొని ♦ సంతస మందెద జీవితేశ్వరా॥

రామ—వైదేహీ! ఆవింతమృగంబు దానవమాయాకల్పితంబగుటచే నట్లున్నది. బ్రహ్మసృష్టిలోనిదికాదు. నీవద్దానినిగై యాసింపకుము.

సీత॥ నాథా! దానిని జూడనాకెంతో యానందము కలుగుచున్నది. ముద్దులాడ బుద్ధిపుట్టుచున్నది. నెచ్చెలుల బాసి యొంటిగ నున్న నాకు దీనితోనాడుకొన ముచ్చట యగుచున్నది. మణి హారములగోరితినా, మందిరంబుల గావలెనంటినా, ఈస్వల్పవు గాంక్ష దీర్చుటకై యిట్లందురా, దానవులకిట్టి యాకృతుల దాల్ప శక్యమా? తప్పక యిదినిజమైన మృగమే? తెచ్చినాయభిమతమును దీర్చుము. లేకున్న నావాహరమైన నొల్ల.

రామ—దేవీ! అట్టి ప్రతిజ్ఞ నవలంబింప వలదు. అటులేనీకోరిక దీర్చెదను, అదిచేతికి జిక్కకున్న గోలకూర్చియైన దెచ్చి యిచ్చెదను. లక్ష్మణా!

లక్ష్మ—(ప్రవేశించి) అన్నయ్యా! ఏమి యాజ్ఞ.

రాము—సీత యాబంగారులేడినిజూచి ముచ్చటపడుచున్నది. దాని దెచ్చుటకేనేగెద. నీవు జానకిని భద్రముగ బరిరక్షించుచుండుము—(నిష్క్రమించును)

లక్ష్మ—చిత్తము

సీత—లక్ష్మణా! ఇదేమోయీా! అకారణముగ నాదక్షిణనయన మదరుచున్నది.

లక్ష్మ—అమ్మా! దేహము తత్వవినిమయ మగుటచేనదిస్వాభావికము. మరేమియు భయములేదు.

(తెరలో) హాలక్ష్మణా, హాతోస్మి, హాతోస్మి,

సీత—అయ్యో, లక్ష్మణా! మీాయన్నగారికేదో విపత్తు సంభవించినట్లున్నది. హాతోస్మియని నిన్ను వాకొనుచున్నారు. వేగపోయి యార్యపుత్రుని రక్షించి తోడ్కొనిరమ్మా.

లక్ష్మ—అమ్మా, మాయగ్రజున కేమియు భయములేదు. సురాసురు
లనైన లెక్కసేయని యుక్కలుండు. ఆమృగముచేతికి జిక్కక
పోవుటచే గోలగు చ్చి యుండనోవు. అయ్యది రాక్షసకల్పిత
మాయామృగమగుటచే బ్రాణముల బాయుచు మనల భ్ర
మింపజేయ నట్లరచియుండును. నీవాయెలుంగునకై జడియకుము.
మాయన్న ఈపాటికి మరలి వచ్చుచుండును.

సీత—ఓరీ, కృతఘ్ను, లక్ష్మణ! ఎంతచక్కగ సవరించి ప్రత్యుత్తరమిచ్చి
తివిరా? హా, లక్ష్మణా? హాహతోస్మియని మీయన్న గారికంఠధ్వని
వినబడ నిట్లనుట నాతని మరణానంతరమున నన్ననుభవింప
దుర్బుద్ధి పుట్టినది కాబోలు, శాపవాక్కులచేనిన్ను దహింతును.
కాని వేళకాదుసుమా! యిప్పుడైన బుద్ధితెచ్చుకొని పోయిర
క్షించుము. దుండగీతనంబును మానుము.

లక్ష్మ— హా, ఈవాక్యము ప్రళయాగ్నివలె దహించుచున్నది. విన
జాల, మనజాల, అమ్మా, మాయన్నగారికి భయములేదని యె
లుంగుదును. మిమ్మిచట నొంటిగ విడచి పోయిన రాక్షసుల
బారిపడెదవని భీతిచే నట్లంటిని కాని దురూహచే నట్లనలేదు.
నీవే తల్లివి, రాముడే దైవము. ఇంద్రియనిగ్రహము మీరెరుగుదురు. రవిసాక్షి. గరుసాక్షి.
నామాటనమ్ముము. ఇట్టి క్రూర వాగ్బాణములచే నన్ను బాడిచి
చంపకుము. ఒక్కగడియ తాలితివేని నామాటలయందు విశ్వా
సము నీకు దోపగలదు.

సీత—ఔరా! ఇంకనూ అదేపదమా! నీయన్న చచ్చునరకు నన్నువేచి
యుండుమనెదవా? మూర్ఖా! పోయెదవా? లేదా

లక్ష్మ—అక్కటా! దురదృష్టవంతుడను. మాతల్లికి నాయందిట్టి యపో
హ కలిగినది. యికపోవకతప్పదు. తరువాత దైవనిర్ణయమెట్లో
అట్లు జరుగును. ఓ పృథివ్యాది పంచభూతములార, ప్రభాక

రాది గ్రహమండలములార, ఓవన దేవతలార, ధర్మదేవతలార, మాతల్లిని శ్రీరామచంద్రుని యిల్లాలిని జనకభూరమణుని పుత్రికను. వీరందరు రక్షించుచుందురు. కారణాంతరమున నేనీమె నిప్పుడు బాయవలసి వచ్చినది. తల్లీ; మేము వచ్చువరకు నీవీపర్ణశాల హద్దును దాటవలదు. నేనిదే అన్నగారి సన్నిధికేగెదను.

(నిష్క్రమించును.)

సీత—ఇదేమియాశ్చర్యమో ఇందలి వృక్షలతాదులు కంపించుచున్నను మారుతము బంధింపబడినది. అదిగో! సన్యాసియెవరో ఇటే వచ్చుచున్నాడు.

(సన్యాసి రావణుడు ప్రవేశించును.)

సన్యాసి—జయజయ, మహాదేవ, శంభూ, జయజయ (చూచి) ఔరా, ఈబంగరు బొమ్మ సింగారము.

ఉ—అంగజమోహనాస్త్రపు మ♦ హత్వముబంగరుకొండదోయియందుంగల సొష్టవంబును వి ♦ నూతనపల్లవ వైభవంబు సా।
రంగవిలాస చంద్రుని హా ♦ రంగురసాధిక భాగ్యలేఖ యీ।
యంగన మేనగన్పడెన ♦ హాభువనత్రయ రాజ్యలక్ష్మి యనా ॥

(ప్ర) ఓకాంతామణీ! ఎవ్వతెవీవు! దానవసంచార భీకరమైన నీఘోరారణ్యమున నొంటినుండ నేమి కారణము?

సీత—మహాత్మా, పరివ్రాజకస్వామి! నేను జనకభూవల్లభుని పుత్రికను. దశరథ మహీపాలుని కోడలను. శ్రీరామునర్ధాంగిని. సీతయను దానను. గుర్వాజ్ఞా పరిపాలనకై భర్తతోడను మరదియైనలక్ష్మణుని తోడను, అరణ్యావాస మొనరింపవచ్చి ఇందు విడిసితిమి. నాథుండును మరదియు నొకలేడికొఱకై ఈప్రాంతమున కేగియున్నారు. ఇప్పుడె రాగలరు. నావాక్యోప చారములగైకొని వారువచ్చువఱకు గొంతసేపిటనుండి నాకురక్షకులై యుండుడు.

సన్యాసి—ఓయువతీలలామా!

ఉ—మాటకతంబునన్ గుసుమ ♦ మంజరి నప్పుల మాడ్చినట్లుఘో॥
రాటవిలోనరాముడు మ ♦ హాసుకుమారిని నిన్ను ద్రిప్పనే!
ఏటిమగండువాడు కృశి ♦ యింపగనీమతి పోయెనొక్కొనా;
పీటికిరమ్ము, సౌఖ్యపద ♦ వీస్థలిచూచి భజింతు నిచ్చలుల్॥

సీత—(స్వ) ఇట్టియనార్య వచనము లాడునీయోగియసురునివలె గన్పట్టుచున్నాడు. అయిననీతని యుదంత మఱసెదగాక (ప్ర) స్వామీ! మీనామ మెయ్యది? ఏకులము? నివాసమెందు?

సన్యా—నారీమణీ! నేను పులస్త్యుని పౌత్రుడను. దశకంఠ సమాఖ్యుడను. త్రిజగములగెల్చి యమరులచే నూడిగము సేయించుకొనుదానవసార్వభౌముడను. నీవునన్ను బరిగ్రహించితివేని నా భార్యలచే, నీకు బరిచర్యలుసేయింతును. లంకాపుర మహారాణివై సకల సుఖంబు లందగలవు.

సీత—ఓరీ దానవాధమా! అపరబ్రహ్మయైన పులస్త్యుని పౌత్రుడవైయ్యును నీయమంగళగుణ రాక్షస క్రౌర్యమును విడువకుంటివే? ఒంటిగనుంటికదా యని నిశ్చయముగ నోరికివచ్చినట్లు వదరకుము. నానాథుం డిపుడేరాగలడు. ఆవిక్రమాదిత్యుడునీచైదముల నరసినచోనిన్ను యముని కతిథిని సేయగలడు. ఆమహాత్ముని నరుడని నిర్లక్ష్యము సేయకుము. దానవవినాశకారణుడైన కాలుడనితలంపుము. బుద్ధికలిగి మరలిపొమ్ము.

సన్యా—జానకీ; నీవు నాపరాక్రమ మెఱుంగక అట్లుపలుకుచున్నావు. అట్టిరాములను కోటిమందిని గోటమీటగల పరాక్రమైకధనుడను. నీవువానికై భయపడ నవసరము లేదు. అతడువచ్చినను వాని సమయించి నిన్నుగొంపోవగలను కాని నన్నెతింగింపకొన్న నీవు వరింపకుందువాయని హితవుగ జెప్పితిని. రమ్ము.

నీపుణ్యముమంచిది గనుకనే కష్టసముద్రమునందు మునిగి నవ
యుచున్న నీకునే దర్శనమొసంగితి నాలసింపకుము.

ఉ. నీపాలుపారుకన్బొమల ♦ నీనిడువాల్గను దోయిచూపులన్
చాపముగా శరావళిగ ♦ జక్కగగై కొని హుంకరించి వ
జ్రోపమమైన నాతనువు ♦ నొయ్య వ్రణంబొనరించుచుండెనే
స్సైప.గజాలగాగిటకు ♦ జయ్యన జేరిచి యేలుపుణ్యమా.

సీత—ఓరీ, కామాంధా, రావణ !

3 (పాట) క్రూరా, రాక్షస, పోరా,

ఉ. నీమదికామతాపమును ♦ నీదుమదాంధత నీదుబింకమున్,
రామలయాంతకాశుగప ♦ రంపర వహ్నికణార్చులేచిని
ర్ధూమముగా హరించు జుమి ♦ దోర్బలముండిన పాటిపోకుమా
నామగడింట లేడనుచు; ♦ నన్నుగ్రహింపగనీకు శక్యమే.

సన్యా—అటులైన నిన్నిపుడే కొంపోయెద నెవ్వడు రక్షించునో
చూచెద. (తన నిజరూపమును జూపును.)

సీత—హారామా, రామా, రక్షించుము (మూర్ఛిల్లును)

సన్యా—ఈమె నిపుడే నారథముననిడికొంపోయెదను.

(తెరపడును)

రంగము—అరణ్యము.

రాముడు ప్రవేశించును.

రాము—ఔరా, నాయెడమకన్నును యెడమభుజంబును అదరుచున్న
దే, సీతకేదైన అపాయముకలిగియుండదుకద. (చూచి)అదిగో
లక్ష్మణుడిటే వచ్చుచున్నాడు. జానకినేమి చేసెనో కదా?

(లక్ష్మణుడు ప్రవేశించును.)

రాము—తమ్ముడా, జానకినొంటిగ విడిచివచ్చితివా? అన్నా; ఎంతపని
చేసితివిరా?

లక్ష్మ—అన్నయ్యా ''హాలక్ష్మణా హతోస్మి"యను వాక్యమాలించి మీకేదో కీడుమూడినదని యాతురత జెందినన్ను మీసహాయమునకై పొమ్మన్నది. మీకేమియు భయములేదు. ఆకూతలు రాక్షస మాయాకల్పితములని ఎంత చెప్పినను వినకనన్ను నిష్ఠురోక్తులాడుట చేవిరలేక యిటువచ్చితిని. పర్ణశాల యిటకెంతో దూరములేదు కదా! వేగపోవుదము రమ్ము?

రాము—అయ్యో, ఇకెక్కడి సీతరా!నామేను కంపించుచున్నది. నా హృదయము నీరైనది. నసువగాళ్ళాడకున్నవి.

చం. వనితలు శుష్కమాత్రృణము ♦ వంటిస్వభావముగల్గియుంట మం
చిని చెడుగున్ విమర్శనము ♦ సేయకకర్ణకఠోరపాప భా
షణములనాడుగాక పెలు ♦ చన్మది ఘూర్ణిలియుండుగాక చం
పిన వటరా;సతిఁ దనుజ ♦ భీకరకాన ద్యజించి వత్తువే.

ఇంతమాత్రమోపిమిలేకున్న నెట్లుబ్రతుకుదువురా? నాయనా! ఆయవివేకిని మాటకు గోపించి యబలనొంటరి విడచెదవా?

లక్ష్మ—అన్నయ్యా, క్షమించుము. అనరానివినరానిమాటలవినుటచే నామెరక్షణభారము దైవముమీాదనిడి మీాకొఱకై వచ్చితి నింతలోనేమియుపద్రవమును రాదు. రండు పోవుదము.

రాము—ఏలరాకుండును.ప్రదేశమా, రాక్షసభూయిష్టము.అబల. కట కటా!నాదుర్నిమిత్తంబులే ఆపదను తెల్పుచున్నవి. ఇకెక్కడిసీత, ఇంకెక్కడివైదేహి?హా! అదృష్టహీనులముకదా. (కూలును.)

లక్ష్మ—అన్నా,లెమ్ము—(లేవదీసినడిపింప తెరలేవపర్ణశాలతోచును.)

రాము—తమ్ముడా ! అదియేకదాపర్ణశాల. దానిదిలకింపగనేనాగుండె గుభిల్లుమనుచున్నది. ఆమెయందున్నదని చెప్పవరకు నేనడుగిడజాల, పోయి చూచిరమ్ము.

లక్ష్మ—(పోయిచూచి పరిశీలించి)అమ్మా! జానకీదేవి! వైదేహీ! తల్లీ, సీతమ్మా! హా, మందభాగ్యులము—(కూలబడును)

రాము—సీతలేదా, క్రౌంచకూలిపోయెనా, హా; హృదయేశ్వరీ, (మూర్ఛిల్లును)

లక్ష్మ—ఉ. ఎంతటిఘోరకర్ముడనొ ♦ యీరఘురాముని గర్భసీమదు ర్దాంత సతీవియోగవిల ♦ యాగ్నికణంబులచాపినాడ ర వ్వంతయు నోర్వలేక జన ♦ కాత్మజ రూపరజేసియుంటి నీ వంతగ్రహించిరాఘవుడు ♦ ప్రాణముబాయునొయేమొదైవమా.

ఈమహాత్ము నేనెట్లు లోదార్తును.ఏమనిపల్కుదును (పగి) అన్నయ్యా? ఊఅడిల్లు మూఅడిల్లుము. ఈప్రాంతముననెందైనయున్నదేమో పరీక్షించుదము. రమ్ము. లెమ్ము.

రాము—అయ్యో! లక్ష్మణా! ఎందులకీ సందియము? ఆవైదేహి, నా ప్రాణవల్లభి, అసురులపాలై యుండును. నాయాత్మకట్లు తోచు చున్నది. అయినను ఈప్రాంతమందడుగుల జాడ ఏదైన నున్న దేమో చూడుమా.

లక్ష్మ—(పోయిచూచి) అన్నయ్యా! ఇక్కడ నొక్కపురుషుని పద చిహ్నంబులు కానవచ్చుచున్నవి కాని యాజాడ మఱెందును బోయినట్లగ పడుటలేదు.

రాము—(చూచి) అవును. హాజనకనందినీ, జానకీ;

చం. గగనమునుండి భూమిడిగి ♦ క్రిన్ననదిన్గాని పోయెనొక్క దై త్యగణములోని వాడుకుటి ♦ లాత్ముని సేతకుసైపకుర్విలో దిగబడిపోతివో పదగ ♦ తిక్క దిలకింపగ తోపకుండెనో మగువరో; ఎందునుంటివో సు ♦ మంబులకేగితో యేటికేగితో.

లక్ష్మ—నీవన్నట్లు గోదావరికి జలార్థమై యతిగినదేమో? రమ్ము చూతము.

రాము—తమ్ముడా; నాకాపదను శంకించి కొందలపకు జానకి గోదావరి కేగిన దని మాత్రిమెట్టు తలంపసగును. అయిన నడువుము.

4. పాట జానకీ. (నిష్క్రమింతురు.)



# లంకాదహనము.



## తృతీయాంకము



రంగము—వనాంతరము, గోదావరి

రాము—లక్ష్మణా, సీత ఇటువచ్చిన పదచిహ్నము లేమైననగపడినవా?

లక్ష్మ—కనపడలేదు.

రాము—ఓయీ, ఆమెతప్పక రాక్షసునకో చేచిక్కియున్నది. హా జానకీ; ఆదురాత్ముడు నిన్ను గ్రసించునప్పుడు నన్నుబిలచి పిలచి నాజాడ గానకఎంతవిలపించితివోకదా? నీవులేని నాబ్రతు కేల? అయ్యో; జగంబంతయునంధకారమైనది. శోకాంభోధి లోము నిగిపోతిని. తమ్ముడా, సౌమిత్రీ! మనతల్లులకును సోదరులకును నేనులేను. నాకుమీరందరులేరు. నాకునిహసుఖంబులికదూరమై పోయినవి. నీవునాయందలి భక్తిచే సేవింపవచ్చితివి కాని యిక నట్టియాస వదలుకొనుము. నీవయోధ్యకు బొమ్ము. నీయందలి యాసచే దల్లిసుమిత్రియు నీయిల్లాలూర్మిళయు నీముఖము నెప్పుడుచూతుమాయని తపించుచుందురు. రాముడేడియని యడిగితిరేని సీతారాములరణ్యమునదా వాగ్నిలో శరీరముల జాలించినారనిచెప్పుము. పొమ్ము.

లక్ష్మ—అన్నయ్యా. ధైర్యమున వలంబించుము. నీవేనాతల్లివి, తండ్రి వదినిన్నారాధించుచుంటిని. సౌఖ్యముల విడచినను సతిని విడచి నను విడచెదనుగాక. నిన్నుమాత్రము విడచిపోవజాల. ఇంతకును మాతల్లిజానకి ఎట్టి విపత్తునందినది. ఎచ్చటనున్నదియు నిక్క ము తెలియదయ్యె. నీవనప్రాంతము నంతయు వెతకివెతకి యామె జాడగనుగొనక యే మనస్సు నిస్పృహ చెంద రాదు. కావున సీతాన్వేషణము సేయుదము. రమ్ము.

రాము—కుమారా; సౌమిత్రి; నీవువట్టి భ్రమనందుచున్నావు కానియామె రాక్షసుల బారిబడినది. సందియములేదు. అయిననరయుదము.

నడువుము.—(నడచి)

చం. వకుళనగంబ! నీవనిన ♦ ప్రాణముసుమ్మి విదేహరాజపు
త్రికకుని నుగ్గనంగనటు ♦ డెంచెనె లేకమతెందుకై నసీ
నికటమునుండిపోయెనె, వ ♦ నీస్థలి నాప్రియురాలి వార్తజె
ప్పికొనగన్గొన వింటివెత ♦ సించెమునాకిసు మంతజెప్పవో.

అదిగో, లేగొమ్మచే యాడించుచు జూడలేదని చెప్పుచున్నది. హా, హతాశుడను కదా.

లక్ష్మ—అన్నయ్యా! ఆజింకకదుపులు కన్నులనీరుగార్చుచు, ఆరాట పడుచు నాకసమువంక మోముల నెత్తిచూచుచున్నవి. ఇందులకే దోకారణముండునని తోచెడిని.

రాము—వత్సా! మనశోకమున కేమికారణమో వాటికినదే హేతు వు. ఆజింకలలో గొన్ని పరిసవించినపుడు మైథిలిపురుడుపోసి వాటిబిడ్డలను లాలించిపెంచినది. అందుచే జానకీవియోగము వాటికిని దుర్భరమై యార్తి నొందించుచున్నది. (చూచి) అది గో; చూడుమూకేర్వ,

చ. పరితిధరణీజముల సొబగు ♦ వాసిదళంబులవార్చి పాండుప
త్రితతి సడల్చుచుండితమ ♦ దైన్యము దెల్పుచునుం డెసీతదు

స్థితిగనియుండెనిక్క-ము వి ♦ ధిపత్రికూలతగాంచిజానకీ
సతినెడబాపినాడుమన ♦ జాలశరీరముమంటలెత్తెరా.

హా, జనక రాజభవ: పతాకనుశ్లోకిని. . (మూర్ఛిల్లును)

లక్ష్మ—అన్నయ్యా, లెమ్ము. ఊరడిల్లుము. ధైర్యమవలంబించుము.

రామ—(లేచి నాలుగడుగులునడచి)

సీ. హరిమధ్యయనుచు సిం ♦ హాంబ! నాప్రియురాలి
జానకిచంపితివేమొ ♦ చెప్పరాదె
గజయానయనిమత్త ♦ గజమసీతనుద్రొక్కి
బిలుకుమార్చితేమొ ♦ పలుకరాదె
కలవాణియనికిన్క ♦ గలిగిసాళువమవై
దేహిఁజీల్చితివేమొ ♦ తెల్పరాదె
హరిణాక్షియనుచుశ ♦ బరులారజానకిన్
గోలగూల్చితిరొ వా ♦ కొనగరాదె

గీ. మీవిలాసలునాపత్నిపై ♦ వెలయుట
గాంచికోపించిహింసగా ♦ వించినారె
ఖగములారవినీలవ ♦ న్నగములార
భ్రమరతతులార ♦ యోమయూరంబులార!

5వ పాట రామమయ

అదిగో, అల్లదిగో, నాజీవితేశ్వరి!రాగదీధితులచేనలరారుకరతలంబెత్తి,
ఇందున్నాను, రమ్మనిపిలచుచున్నది. లక్ష్మణా!దొరికినదిరా.

లక్ష్మ—అన్నయ్యా, అదిపుష్పశాఖకాని సైదేహి బాహువుకాదు.

రామ—ఇస్సిరో, నేనెంతభ్రాంతిజెందితిని.ఔను.నీవట్లన్నదియేకానిఈ
క్రేవనాపూవుంబోదలమధ్యచూతుము. తిన్నగబరిశీలించుము.

గీ. తావులనుజిమ్మువదన ప ♦ ద్మంబుగాంచి
యానవభ్రాంతిచేత మ ♦ దాళులడర

చేతితో ద్రోలుకొనుచువం ♦ చినమొగంబు
గలదిజానకియేయని ♦ తలచువాడ.

లక్ష్మ—కాదు. మీామనోభ్రాంతిచేనట్లగుపడుచున్నది. అయ్యది భ్రమరావృతమైన పూచినకొండ గోగుమొక్క. రమ్మీ.

రాము—ఔరా! ఎంతదుర్దశ. నాకనులకు జానకీవలెనే కనుపట్టినదికదా (ముందుజూచి) ఇదిగో, ఇదిగో, ఈసారితప్పకసీతయే దర్శనమిచ్చినది. నీవురెండుచన్నులవిప్పి బాగుగజూడుము. మనయాపదదీఱిపోయినది.

లక్ష్మ—అన్నయ్యా; ఎచ్చటనున్నది.

రాము—అదిగోరా, కన్నులులేవా? వీనులులేవా?ఆమెకోమలవాక్యలీలవినుటకు బాగుగనాలకించుము. నాతోనేమనుచున్నదో?

లక్ష్మ—ఏమనుచున్నది.

రాము—ఓయీా, బధిరుడా! ఆమెయన్నమాటలనేజెప్పెదవినుము.

చ॥ నరవర మీామనంబునను ♦ నాయెడ ప్రేమ మదెంతయున్నదో
యరసి పరీక్షసేయగ గృ ♦ హాంగణమ్మున ద్యజియించిపుష్పసం।
భరితలతాళి డాగితి న్వ ♦ భావమెఱింగితి మీాకునిట్టిదు।
ర్భరశ్రమనిచ్చినట్టి నను ♦ రక్షణ సేయుమటంచు బల్కెడున్॥

లక్ష్మ—అయ్యో, అన్నయ్యా, మీామతి సీతామయమగుటచే నట్లగపడుచున్నది. కాని అయ్యది పూవుంబొదలలోని శుకపికశారికల మనోహరారవము.

రాము—దొరకినదిరాసీత—(మఱొకపుష్పలతనుగౌగలించుకొనును.)

లక్ష్మ—కటకటా; మాఅన్నగారి కంతకంతకు పిచ్చియెత్తుచున్నది. నేనేమిసేయుదు. నీయున్మాదమెట్లుతొలంగింతును(ప్ర) అన్నా, లెమ్మీ. నీకుమతిభ్రమించి యున్మాదముకలిగినది. మనసుకుదురుపఱచికొనుము. ఇది సీతకాదు. పుష్పించిన కుఱువకశాఖ.

రామః—ఓయా! నీవెవ్వడవు?

లక్ష్మ—నేనుమీతమ్ముడను లక్ష్మణుడనుకానా?

రాము—నీవు లక్ష్మణుడవా? అటులైన నాకనుపట్టు సౌధమున కేగుదము. రమ్ము.

లక్ష్మ—ఇక్కడసౌధములేదు. ఆకనుపించునదికొండ. ఇదియరణ్యము.

రాము—అదికొండయా, ఇదియరణ్యమా, మనమిందేలవచ్చితిమి?

లక్ష్మ—అన్నా అట్లనెదవేమి?

గీ॥ తండ్రియానతి మనమయో ♦ ధ్యనుద్యజించి -
వనములందున బదునాల్గు ♦ వత్సరములు
దిఱుగరాలేదె జానకీ ♦ దేవినీవు।
నేనునీగతి భ్రమనొంద ♦ మానుమన్న॥

రాము:—అటులైన జానకినిబిలువుము. మనమయోధ్యకుబోవుదము.

లక్ష్మ:—(స్వగతము) అక్కటా; నేనేమనిప్రత్యుత్తరమొసగువాడ(ప్రి) అన్నయ్యా,

గీ॥ జనకపుత్రికనలపర్ణ ♦ శాలయందు
మనముకోల్పోయియిట్టులీ ♦ వనమునందు
నామెజాడలనఱయుచు ♦ నధికశ్రమల
నపయుచుండగలేదె య ♦ న్నాయదేల.

రాము:—హా, ప్రాణవల్లభీ, జానకీ, నిన్ను గోల్పోయితినా?

(తెరలేవగా జటాయువు కనబడును.)

లక్ష్మ:—అన్నయ్యా। అల్లదే, మనజానకినిమ్రింగినదానవుండెవడో పక్షిరూపమును దాల్చియందు మనల గూడమ్రింగుటకు గాచుకొని వేచియున్నాడు.

రాము:—అట్లయిన నిదేనా బాణాగ్నిచే వానిభస్మమాత్రునిగజేసెద;

జటాయువు:— ఆ, ఆ, తాళుము. తాళుము. రామా, నీపితృసఖుండనైన జటాయువను ఖగనాథుడను కానిదానవుడనుకాను. నీభార్య

నుజానకిని దస్కరించిరావణుఁడు తనలంకాపురమునకాంబరిమా ర్గమునుండి కొంపోవ వానినెదిరించి భగ్నరథునిజేసి నొప్పింప వాడలిగి నాపక్షముల ఖండించితేరలిపోయెను. ఈవార్తనుమీా కెఱింగించువఱకు బ్రాణముల బిడికిలించుకొనియుంటిని. నేనికఁబుణ్యలోకమునకేగెద. నీవునీతండ్రియట్లనాకగ్నిసంస్కారము జేసిపొమ్ము. నీకుబుణ్యముండును.

రాము:—ఏమీా, లంకాధిపతియైన రావణుఁడా; మాజానకినిగొంపోయిన దురాత్ముఁడు. ఓరోరి, రావణా!

6 పాట జొరా॰ రావణ

చం. కనుమొఱగించి నానతిని • గైకొనిపోయిన నిన్నునీకులం
బును దెగటార్చి నీకురణ • భూమిసహాయము సేయువారలఁ
దునిమిత్వదీయదుష్కృతికి • దోడయియూఱక చూచుచున్నసూ
ర్యునిగ్రహమండలిన్ద్విజుల • నుర్వరనింగిని రూపుమాపెదన్।

లక్ష్మ:—అన్నయ్యా! దురాత్మునిపై నలుగుట సహజమే; నిరపరాధుల పై నాగ్రహింతువా? శాంతింపుము.

రాము:—తమ్ముఁడా! ఇప్పటికి సీతవార్తనుంత తెలిసినది. ప్రాణములగో ల్పోయిన యీపక్షీంద్రుండు మనతండ్రివంటి వాడగుటచేనీత నికగ్నిసంస్కారమొనరించి పిదపజానకిని గొంపోయిరావణుఁడెం దుంచెనో యడవులనెల్లగాలించి కనుగొని యాదానవాధముని సంహరించుదమురమ్ము.

లక్ష్మ:—చిత్తము. (ఇద్దరునిష్క్రమింంచెదరు.)





శ్రీ

# లంకాదహనము.



## చతుర్థాంకము

---

రంగము-ఋష్యమూకప్రాంతము

రామలక్ష్మణులు ప్రవేశించెదరు

రాము॥

సీ॥ కందునాకన్నులక ♦ ఖవునీఖగసీత
వదనేందుబింబ ♦ మెప్పటికైన
ఆడుదునా స్నానము ♦ వని జాలావణ్య
లీలాబ్ధిలోన ♦ నెన్నాళ్ళకైన
విందునా అమృతని ♦ ష్యందనజానకి
పేశల వాక్యమే ♦ వేళకైన
అరుగుదుమాఅయో ♦ ధ్యకు మైథిలిన్గొని
రమణతోనేముహూ ♦ ర్తమున కైన

గీ॥ ఇంకగను వచునా సీత ♦ యేటివెఱ్ఱి
అట్టిభాగ్యం బెయున్ననీ ♦ నట్టడవిని
భార్యగోల్పోవు ఉడని ♦ ప్పగిది దిరిగి
శ్రమలబడ నేలయిది వట్టి ♦ భ్రాంతి సుమ్మా.

ఎప్పుడా క్రూరరాక్షసుని కంటబడినదో, అప్పుడే సీతకొఱకొఱ జలాం

జలి విడువవలెను. తమ్ముడా! అదృష్టహీనుడనైన నాతో పా
టునీకీకష్టములేల? అయోధ్యకు బోరాదా?

లక్ష్మ॥ నేనుమాత్రము మిమ్ము విడచి పోవువాడనుకాను.

రామ॥ అదుగో! ఎవ్వడో, ఇటువచ్చు చున్నాడు.

ఆంజ॥ ఓతాపస వేషధారులైనదివ్యతేజోమూర్తులారా! మీరెవ్వ
రు! మీనామము లెయ్యవి; ప్రశాంత భూమికలనలరారి
యు బాణ బాణాసన ధారణంబునం జేసి మేరుధీరులచిత్తముల
గూడనీరు జేయుచున్నారు. మీ యుదంతమునుజెప్పినాస్వాంత
మునుజల్ల జేయుడు.

రామ॥ ఓభిక్షుకుడా, మేమురఘువంశసంభవులము, దశరథపుత్రు
లము, రామలక్ష్మణులను సమాఖ్యగల వారము, తండ్రిపను
పునమావదినగారైనసీతతో నరణ్యావాసమునకు వచ్చిదం
డకారణ్యమున బంచవటీతీరమున నామెను గోల్పోయియా
వైదేహిజాడ నరయుచునిటు వచ్చితిమి. అద్భుతశోభలతోనల
రారుకుండలముల భాసిల్లు నీవేజాతివాడవు, నీనామంబెయ్యది

ఆంజ॥ (స్వ) ఓహో; తొల్లినాకు వరంబొసంగి నవుడు నిన్ను నకుండ
లునిగనే మహాత్ములు గుర్తించెదరో వారేనీకు సేవ్యులని
బ్రహ్మచెప్పి యుండెను. ఇవుడునాజన్మ సార్థకమైనది. నాత
పంబునేటికి ఫలించినది. వీరుకేవల దివ్యులగు వతారులని తెలి
సికొంటిని (ప్ర) మహాత్ములార, మీపవిత్ర దర్శనమున ధ
న్యుడనైతిని. నేనువాయుదేవుని యనుగ్రహమున అంజనా
దేవికి బ్రభవించిన వాడను, వానరజాతి వాడను, సూర్యసు
తుడైన సుగ్రీవుడు మాప్రభువు. మీశత్రుధారణమున భీతి
ల్లిమీచరిత్ర మరసి రమ్మనినన్ను బనుపనీభిక్షుక వేషముతో
వచ్చితిని. మీరుసుగ్రీవునితో సఖ్యము బాటించితిరేని మీ

కు కుశ్లోపకారము కాగలదు. రంభ. అదే, ఋష్యమూకపర్వతము, పరమపవిత్ర మూర్తుల మిమ్ముగాంచి తరించితిని, మీకివే పదివేలవందనములు.

(అందరు నిష్క్రమించెదరు)

రంగము—ఋష్యమూకము

సుగ్రీవుడు వానరులు ప్రవేశించెదరు

సుగ్రీవు॥ వానరులార, మనహానుమంతుడా వీరుల దోడ్కొని యిట్లేవచ్చుచున్నాడు, కావున వారు మన శత్రువులుకారని స్పష్టమగుచున్నది.

(రామలక్ష్మణహానుమంతులు ప్రవేశించెదరు)

సుగ్రీవు॥ (ఎదుర్కొని) మహాత్ములార, మీకువందనములు. (నమస్కరించును)

రాము॥ సుగ్రీవ, అభయోస్తు.

ఆంజనే॥ సూర్యనందనా, వీరు సూర్యవంశతిలకుడైన దశరథమహీపాలుని పుత్రులు. రామలక్ష్మణులను వారు. ఆశ్రితరక్షకులు, నీకభయ ప్రదాతలు కాగలరు, నీతోజెలిమి జేసికొననే తెంచిరి.

సుగ్రీ॥ మహాపురుషులార, నాయిచ్చునతిథి సత్కారము గైకొనినా కభయప్రదాన మొసంగుడు. నాతోమైత్రి పాటింపదలచిన నా చేతిలో జెయివయిచి అగ్నిసాక్షిగ జెలిమిని జేసికొనుడు. మీకునేను సహాయుడనై మీకార్యముల జేసెదను.

(కరముసాచును)

రాముడు॥ సుగ్రీవ! (చేతులలోవైచి) అగ్నిసాక్షిగ నీతోజెలిమి జేసికొంటిని, నేనుపంచవటీతీరమున నాలిని గోల్పోయియామె జాడనరయుచు నెందును గానక పరితపించు నాకునీవు సహాయ

పడవలయును. నీవునన్ను భయము గోలితివి కావున నీకుభయ కారణమేమో చెప్పుము. నీయభిమత మీడేర్చెదను.

సుగ్రీ॥ ప్రభూత్తమా; ఇంద్రనందనుండు వాలినాయగ్రజుండు. అతడు నారాజ్యమును గైకొని నాభార్యన పహరించినన్ను బురము నుండి వెడలనడచె. వానికిజడిసి యాతనికి దుష్ప్రవేశ్యమైన యీఋష్య మూకంబున వసించుచుంటిని. కావున వాలినిని గ్రహించి నాభార్యను నాకిప్పింపుము. ఇదేనిన్ను శరణు జొచ్చితిని?

రామ॥ రవినందనా; వాలియిట్లు సేయుటకుగారణమేమి?

సుగ్రీ॥ స్వామీ; మయుని పుత్రుడుదుందుభి యనువాని యన్నయు నై నమాయావి యనురాక్షసుండొక నాటిరేయి వచ్చిసింహ నాదంబు సేయమాయన్నవాలి వానితో బోటి తరుమనాద నుజుడొకకొండబిలమున జొచ్చె. మాయన్నయు వానివెన్నంటి లోపలికిపోవుచునన్ను బిలద్వారంబునుండనియ మించె. కొంతకాలమున కాబిలమునుండి రుధిరము ప్రవహించెను. మాయన్నకంఠధ్వని దైన్యముగావినవచ్చెను.ఇట్లుసంవత్సరము. కడచిన మాయన్న మరణించి నట్లెంచి యారక్కసుండు మర లివచ్చి నన్నుబాధించునను భీతిచే గొండబిలమున కడ్డుగ వేఱొ కకొండను అడ్డువెట్టిపురమునకు వచ్చితిని. అప్పుడుమంత్రులు వానరరాజ్య మరాజకముగ నుండరాదని నన్నభిషేకించిరి. కొన్నాళ్లకు వాలివచ్చి తానుమరల రాకుండ నేనిట్లు చేసితినని యెంచినన్ను జావగొట్టి నాభార్యను అనుభవించుచున్నాడు. వాలినిహతదుందుభిరక్త మీఋష్యమూకంబున బ్రవహిం పనందు దపోనిష్ఠతో నున్నమతంగు డాగ్రహించి వాలియీ కొండబ్రవేశించిన మరణించుననిశపించుటచే నిర్భయముకదా

యని నేనిందు మంత్రులతో వసించుచున్నాను. కావునవాలి
నివధించి నాభార్యను నాకనుగ్రహింపుము. ఇదేనాప్రార్థనము.

రాము॥ ఇనతనయా; భయములేదు. నామాటవినుము.

చం॥ అమరగణంబు తోడద్రిపు ♦ రాంతకు డడ్డమువచ్చుగాకలో
కములు ప్రియంబుచే నతని ♦ గాయుగనాపయి మూగుగాకవి
శ్వములతల క్రిందు నైనవల ♦ వానినిజంపితన్వదీయ పత్నిమో
దమునున గూర్చు వాడనది ♦ తప్పినరాముడ గానునమ్ముమా.

సుగ్రీ— మహాప్రసాదముచె చేకొంటిని. కృతార్థుడనైతిని. రామ
చంద్రప్రభూ;

చం॥ గిరులను కందరమ్ములను ♦ కీచకగుల్మముల న్వనంబులన్
ఝురులరమాస్యసీమలను ♦ జయ్యనరాక్షసితద్విరోధినిం
దురమున గూల్చిమీహృదయ ♦ దుర్భరతాపము వాయునట్లుమీ
తరుణిని మీకుగూర్తునటు ♦ తప్పిన భాస్కరసూతిగాంజుడీ.

రాము॥ బళిరా, సుగ్రీవా; నీవాక్సహాయమునకు సంతోషించితి.

సుగ్రీ॥ రామచంద్రప్రభూ; మఱి యొకమాట, ఒకనాడ పరాహ్ణంబు
నగగనంబున "హారామా, హారామాయని" యార్తధ్వని వినవ
చ్చినది. అంతట మింటివైపు జూడమైనుండి యొకయాభ
రణముల గట్టిన మూటమాచెంత బడినది. దానినీచెట్టు
తొఱ్ఱలో దాచియుంచితిమి. పరీక్షించెదరు కాక.

(పోయి వస్తువలమూటదెచ్చి రామునకిచ్చును)

రాము॥ అహా; ఇంకను సందియమేమి?

మ॥ జిలుగుంబైట చెఱంగు తున్కయిదిమా ♦ సీతావధూశ్రోణిచ
క్రిలసత్కాంచిపటార్థమీయదియొని ♦ క్కంబిందులోనున్నమం
జులమంజీరముసీతకాలిదియొపాం ♦ సుస్ఫూర్తిచే ద్రుంగినా
లలనాదైన్యము దుర్భరంబనుచు దె ♦ ల్పనవ్వచ్చెనీధాత్రికిన్.

(కన్నులనద్దుకొని)

ఓమణిమంజీరమా:

చం॥ అసురుడు సీతదోడ్కొని వి ♦ యత్పథమందునబోవనెంతగా
వ్యసనముజెందెనో హృదయ ♦ వల్లభరాఘువరామ ప్రోవవా
యసమవిపన్మహాబ్ధిబడి ♦ ప్రాణముబాయగనుంటినంచునీ
రసపడియెంతమేడ్చెనొబి ♦ రానవచింపుము నీకుమ్రొక్కెదన్॥

సుగ్రీ:—ఆర్యా; విచారింపకుము.అనతికాలమున నీయాపదగుడువంబె ట్టగలను. ఏకవిధసంతాపభాక్కులమైన మన దుఃఖభారము మనకే తెలియును గాని యన్యులకు దెలియనేరదు?

రాము:—అగునిప్పుడు విచారించిన లాభమేమి; ముందుగనీయభయ ప్రదానము నిర్వర్తించెదను.

సుగ్రీ:—బాబూ; వాలియన సామాన్యుడు కాడు. జగంబులనన్నిం టినిగెలువగల పరాక్రమశాలి. మిమ్ము బరీక్షసేయుచున్నానని తలపకుడు. ఒకబాణంబున సప్తసాలముల నెవడుభేదించునో పదహతిచేనిదుందుభి కళేబరము నిందుండి యోజనమువఱకు నెవ్వడు మీటునో అట్టిదోర్బలశాలియే వాలిని జంపగలవా డుకాని అన్యులవలన గానేరదు. కావునదద్విషయమై యోజిం పవలయు.

రాము:—కపీంద్రా, నీసంశయమట్లుండుట సహజమే?నేనందుకుసందే హించువాడనుకాను. ఇదేచూడుము.

(దుందుభిని నఖాగ్రముచే మీటిఒక శరముననేడుసాలముల గూల్చును. వానరులు గంతులువేయుదురు.)

సుగ్రీ:—ఓహో? మహానుభావా ; రామచంద్ర, (పదములవ్రాలి)

చం॥ అరమరలేదునీవునన ♦ జాతుడవాద్యుడ విందిరామనో
హరుడవె నన్నునిట్టివిప ♦ దాంబుధినుండి సముద్ధరింగా
నరుడవుగా జనించితి వ ♦ నంత త్వదీయభుజోరువిక్రమ
స్ఫురణవిమర్శసేయగగ ♦ పుల్ తకువారెయనుగ్రహింపుమా.

అంజ:—బలే, బలే, యానందము, మహాయానందము. (గంతులిడుచు)

ఉ॥ కాంచితిబూర్ణమోదమును ♦ గాంచితిసార్థమునాదు జన్మకున్
గాంచితిగన్నులార ద్విజ ♦ గత్పరిపాలన దివ్యమూర్తినిన్
గాంచితిమత్స్వపర్యలను ♦ గైకొన సద్మనిలోకసేవ్యునిన్
గాంచితిమత్ప్రభూత్తముని ♦ గన్నులకల్మిఫలింప నీయెడన్.

7 పాట దర్శించితి

స్వామీ ఆదిదేవానారాయణ !

ఉ॥ నీకరుణావలోకనము ♦ నీనివహంబులు సోకుటన్గదా
లోకమునమ్ముదాంబునిధి ♦ లోలతరంగములందునూగి సౌ
ఖ్యాకరమైయనంత విభ ♦ వాతిశయంబున గ్రాలుచుంటదే
వాకమలాక్ష నీచరణ ♦ పంకజదాస్యము నాకొసంగవే.

(నమస్కరించును.)

రాము:—ఓసుగ్రీవాంజనేయులార ! మీయనంతభక్తికి నానందించితిని. ప్రస్తుతకార్యము వాలినిగ్రహము కావున దత్ప్రయత్నమునకు బోవుదము. రండు.

సుగ్రీ:—మహాప్రసాదము.

ఆంజ:—ఈలాగునరండు. పోదము.

(అందరునిష్క్రమించెదరు.)

రంగము—కిష్కింధ

వాలిసుగ్రీవులు ప్రవేశించెదరు.

వాలి:—ఓరీ! సుగ్రీవా,

ఉ. మొన్నటిదాక నన్నుగని ♦ మూలనడంగిన వాడవిప్పుడ
త్యున్నతినన్ను భీకరర ♦ ణోర్వికిసన్పిలువంగనేలతా
చెన్నటి ! ఇప్పుడే ఘనుని ♦ స్నేహము కల్గెను తీర్తునిప్డెనీ
మున్నరికంబునీదు ప్రభు ♦ ముచ్చట నిల్వదు సూర్యనందనా.

సుగ్రీ:—ఓరీ, భ్రాతృభార్యాపహారీ! వాలీ; అతిక్రాంతధర్మపథుండవై న నీమహాపాప మిప్పటికి నిండినదని తెలిసియింతవఱ కుపేక్షిం చియిప్పుడెదురు పడితినిక నీదుర్నయము సాగదు. రమ్ము. రణముసేయుము. నిన్నిప్పుడే యమసదనంబున కినిపెదను.

వాలి:—అలాగునా; అటులైన రమ్ము.

(ఇరువురు యుద్ధముసేయుదురు.)

సుగ్రీ:— (స్వ) అక్కటా! రాముడాలస్యము సేయుచున్నాడు. వీనిముష్టి ఘాతములకు ప్రాణములు కడముట్టుచున్నవి.

(చెట్టుచాటుననున్న రామునిజేరెను)

వాలి—ఓరీ,తుచ్ఛుడా! ఇంతమాత్రపు పరాక్రమమునకేనా నన్నాజికి బిలచితివి. ఛీ, పారుబోతువు. నీతో నాకేల—

(నిష్క్రమించును.)

రాము—సుగ్రీవా! నీవుతిరిగి వచ్చినసంగతి నాకుదెలియును. మీరిరువు రొక్క రూపముగలవారగుటచే నిన్నే కూల్చెదనేమోయని భయపడి యుపేక్షించితి. ఆనవాలుగ నీవీగజపుష్పమాలను ధరించిపోయి క్రమ్మరవానిని రణమునకు బిలువుము—

(పుష్పమాలవేయును)

సుగ్రీ—దేవా! ఆలసింపకుమా!

(నిష్క్రమించివచ్చి)

ఓరీ, వాలీ: దుశ్శీలీ రమ్ము. రమ్ము. నేనుపారిపోతిననితలంచితివా? వేగరమ్ము.

వాలి—(ప్రవేశించి) సుగ్రీవా! నీవిపుడుసార్థకనామధేయుడవైతివిరా! కానినీవిప్పుడు నాచేతహతగ్రీవుడవు కాగలవు.

సుగ్రీ—అటుసేయవచ్చు. నీలోపుననీవు చావకున్న రమ్ము.

(ఇద్దరు యుద్ధముసేయ రామశరము వానిని గూల్చును.)

వాలి—హా, భయంకర శరపాతము. మనీయప్రాణాపహారణ ఖ్యాతము హా, విలయకలనమహా భైరవశూలప్రతీక్షము! ఔరా; ముష్టి యుద్ధమునకు గడంగిన సుగ్రీవునకు బాణమెక్కడిది? మఱెవ్వడో దీనిని విడచియుండనోపును. అదుగో, ఆచెట్టుచాటున నెవ్వడో వినీల నీరదశ్యామాంగుడు. ఓహో తెలిసినది. రామా! నీవేనా. యిట్టితస్కర సమరము జేసినది, ఓహోహో! రఘు కులమునకెల్ల కళంకమును దెచ్చితివే? నిన్నుధర్మరక్షణ పరతం త్రుడని మునులెల్ల వ్యాకొనుచుందురే? అట్టినత్కీర్తిని ఖిలంబు చేసికొనుటకు గాక నన్నీరీతిని చెట్టుచాటునుండి కూల్చెదవా? అక్కటా; కిరాతుడైన నిట్టియకృత్యమునకొడిగట్టడే, శివశివా! నీవెటువంటి ప్రభుడవు, రామా.

రామ—వాలీ; నీవధర్మపరుడవై సోదరునిభార్య నపహరించిన పాప కర్ముడవగుటచే నార్యులచే ధర్మాధికారమున నియోగింప బడిననేను నిన్నువధింపవలసి వచ్చినది. అంతియెకాక రాజులకు మృగయావిహారమవశ్యాచరణీయంబు. నీవుశాఖామృగంబవు. నగపాలురు మృగంబుల హింసించుపట్టునచుచ్చులుబన్నుటయు మాటులొగ్గుటయు నాచారమైయున్నది. కావునన న్నివాక్షేపిం ప బనిలేదు.

(తార అంగదుడు ప్రవేశించెదరు.)

తార—హా, ప్రాణేశ్వర? భుజబలవిక్రమంబున త్రిభువనంబుల గెలువ గలవాడవగుటచే నీకిట్టియకాలమరణము సంభవింపదని తలం చితిని. అయ్యో!నీకింతలోనే యాయువుమూడినదా? నాధా?

అంగ—తండ్రీ; నీకుమారుని నన్నెవరికర్పించెదవు? మమ్ములదుఃఖమున ద్రోసి నీవుమరణవేదననొందుచుంటివా! జనకా?

వాలి—హా, జీతేశ్వరీ విచారింపకుము. కుమారా; కంటదడి వెట్టకుము. స్వయంకృతకర్మము ప్రతియుపాధికిని అనుభవింపక తప్పదు.

తార—రామా! నీవుజగత్కల్యాణగుణుడవని యందురు. బొగ్గులకై కల్పతరువునుబొడచినట్లు సుగ్రీవునిజేబట్టుటకై నానాథుని అన్యాయముగ జెట్టుచాటుననుండి కూల్చుటేటిన్యాయము? సుగ్రీవుడు చేయుపాటి యుపకారము నామగడు చేయలేకపో వునా? నీభార్యనపహరించిన రావణు ననేకసార్లు పరిభవించిన మేటిబలశాలియే! నాభర్తనేచేపట్టిన నీభార్యను క్షణములో నీవశము చేయకుండునా; అక్కటా, యెంత యమంగళకార్య మును జేసితివి. ఓయీ; ఒకసుగ్రీవుడువచ్చి నీతో నేదియో చెప్పి నప్పుడు వానినిబిలచి యతనివాగ్మూలమునుగూడ విని నేర ముచేసినవానిని శిక్షించెదరుకాని కేవల సుగ్రీవుని మాటనే పాటిచేసి వాలిని వధింతువా? నీధార్మికబుద్ధి యిట్లులతగులబడి పోవలయును? భార్యావియోగదుఃఖ మనుభవించుచు నాకు భర్తృవియోగమునుగలిగించితివే. నిన్నునేనుశపింపక పోవలేను కానినీవలె త్వరపడిననన్ను లోకమునిందించునని యోర్చికొను చున్నాను.

వాలి—తారా! నీవు ఆమహానుభావునిపై నాగ్రహింపకుము. ఈ నామరణము నాదుష్కర్మఫలము.

రాము—తారా; కక్షిదారుల వాక్యములకంటె ధర్మపీఠాధికారమును వహించిన మావిమలాంతఃకరణమునకు దోచినయదార్థము ననుసరించి దోషాదోషములనిర్ణయించుకొని అపరాధిని శిక్షించుట రాజులకు ధర్మము. అందువలన నీవునన్ను ఆక్షేపింపవలదు. సుగ్రీవు కృతాపరాధియగు వాలికిట్లు మరణదశ పరమేష్టిచేనిర్ణయింపబడినదని తలంచుము. గతా యువులకొఱకు విలపింపకు, నీభర్తకు వాచేమరణముకలుగుట, సద్గతులనందుట కొఱకుగాని వేఱుకాదు.

వాలి—రామచంద్రా! నీవువచ్చినదినిక్కము. నీవు నాకుబుణ్యలోకము లీయగల పురాణపురుషుండవు. నాఅంత్యదశకు నేను చింతింపను. నాచిన్నకుమారు నంగదుని నీవశముచేసితిని. ఆబిడ్డను సుగ్రీవునిబోలె చూచుకొనుము. వానికి గిష్కింధా సామ్రాజ్యమునకు యౌవరాజ్యపదవినొసంగుము. సుగ్రీవా; ఇంతటితో నాయందునీకు బగతీఱిపోయినది. అంగదకుమారు నీపుత్రునిగబ్రేమించి సంరక్షించుము. నేనొనర్చిన యపచారము మరచిపొమ్ము. రామా, కళ్యాణగుణధామా, నీశరవేదన నేను సహింపలేకున్నాను. నీవు ప్రయోగించిన శరంబును నాకుక్షినుండి యున్మూలింపుము. అదిగో, నాకొఱకు దివ్య విమానమువచ్చినది. తారా; ఇకనేను పోయెదను. భగవంతుడైన శ్రీరామమూర్తిని ధ్యానించుచు నంగదకుమారునిరక్షించుకొనుము. ఏడువకుము. ఏమి, రామా, ఇంకనాకు సెల విమ్ము. కుత్రా, అంగద, రాముడు జగములకుదండ్రి. నీవా తనిసేవించి బ్రతుకుము. శ్రీరామమూర్తీ! నీకుసహస్రవందనములు.

రాము—(శరమునులాగి) వాలీ, నీవుపుణ్యలోకమునకేగుదువు.

వాలి—హా, శ్రీరామా, రామా,—(మరణించును. తెరపడును.)

రంగము—ప్రస్రవణాచలము.

రాముడు—ఔరా! కాలమహిమ; అగ్నిసాక్షిగనాతోడ మైత్రిని గావించికొని నాచేత శాత్రవసంహారముజేయించి కిష్కింధా సామ్రాజ్యమునకు నాకతంబున బట్టభద్రుడై సుగ్రీవుండు నాకార్యమును మఱచి ప్రమత్తుడై కాంతాలోలుడై ప్రవర్తించుచుండెనే; పథికజనసంతాపకరమైన వర్షర్తువు నెట్టెటులో గష్టముమీదనడిపించితిని. అప్పుడేశిశిరర్తువునగముగతించెను. సమరయోగ్యమైన హేమంతము తొంగిచూచుచున్నది.

ఉ. ఎప్పుడు వానరుద్దిశల ♦ కేగుటొ జానకి సేమవార్తలన్
జెప్పుటలెన్నడో ఖలుని ♦ జెంపుటయెప్పుడో భార్యతోడనే
నెప్పుడు సౌఖ్యమొందుటో యి ♦ హీనసముద్రంబును గాంచు టెన్నడో
దెప్పరమయ్యె వాసరములు ♦ దీర్ఘములయ్యెను వాసరంబులున్

అయినను సుగ్రీవుని దోడి తెచ్చుటకు లక్ష్మణుని బంపితిని కాదా; కాని యీతను సులభకోపుడు. అతడా; వానరుడు, కోతులతో జలగాటము కార్యహానికరమే మోయని సంకోచింపుచున్నాను. (ముందుజూచి) అదిగో, లక్ష్మణుడు సుగ్రీవ హనుమదాది వానరులతో వచ్చుచున్నాడు.

(లక్ష్మణ సుగ్రీవ హనుమదాది కపులు ప్రవేశించెదరు.)

సుగ్రీ—మహాత్మా! రామచంద్రప్రభూ; రక్షించుము రక్షించుము.

శా॥ కామాంధుండ బ్రభుప్రశాసనతిర ♦ స్కారుండ బ్రత్యాపకా
రామోదంబును విస్మరించితిని దు ♦ ర్మార్గుండ స్త్రీలోలుడన్
స్వామీ, నాయవివేకమున్ మనుపు మా ♦ జాలంబు సైరింపు మీ
ధీమంతుడవు స్వల్పబుద్ధి గలకో ♦ తిన్నేను రక్షింపుమా.

రాము—సుగ్రీవా! ధీమంతులకైన బ్రమాదము కలుగుట సహజము. కడచినదానికై వగవరాదు. ఇక భవితవ్యమును నిర్ణయింపుము.

సుగ్రీ—స్వామీ! ఇదిగో, హనుమదాది ప్లవంగసేనను దోడ్కొని వచ్చితిని. అనేకకోటులు మహాసమర్థులిందున్నారు. దుర్ఘట కార్య ఘటనాధౌరేయుల సందఱ నాలుభాగములుగా విభజించితిని. ఈవినతముఖ వానరసేనను తూర్పుదిక్కును బరీక్షింప బంపెదను. శతవలిప్రముఖ కపియూధంబు నుత్తర దిశ పరీక్షింప నియోగించితి. సుషేణాది వనచరులను బశ్చిమదిశాన్వేషణార్థము నియమించితిని. ఇక రావణుని నివాసము లంకాపురమగుటచే నచ్చోటునకు మహాపరాక్రమవంతుల

ననుపుట యుక్తముగనుక హనుమజ్జాంబవదాంగదాదివానరుల దక్షిణదిగ్వలయమునంతయు వెదుకుటకేర్పరచితి నింకదేవర యాజ్ఞనొసఁగవలయు.

రాము.—సుగ్రీవా! ఎట్టివారి నెచ్చోట కనుపవలెనో, ఎవ్వరెట్టిసామర్థ్యముగలవారో, నీవెరింగినంతనాకు దెలియదు. నీసంవిధానము మెచ్చఁగినది. వీరుతిరిగివచ్చుటకు గడువొసంగవలయు నట్లునియమింపకున్న గార్యదీక్ష సక్రమముగ జఱుగదు.

సుగ్రీ.—చిత్తము. అట్లేచేసెదను. ఓ వానరనాయకులార, మీరతిశ్రద్ధతో గార్యదీక్షవహించి మీరుపోయిన దిక్కులయందున్న భయంకరారణ్యముల, కొండగుహల, నదుల, బొదలవేయేల? అచ్చోటగల సర్వస్థలముల నొకటినైన విడువక పరీక్షించుడు. అందెచ్చటనైన జానకీదేవి కన్పడిన నామెను మీలో నెవరైన మహాసమర్థులైనవారు రక్షించుచు గొందరిచ్చోటికివచ్చి వార్తజెప్పుడు. రావణుడగపడెనేని వానిని బాహుపాశబద్ధునిగజేసి బంధించియుంచుడు. మీకందఱకొక్కమాసముగడవిచ్చితిని. ఈలోపుగరాక నాయాజ్ఞనతిక్రమించి ఎందైన బ్రతుకుమాలితిరేని మీశిరంబుల నాఖరాసిచే నఱికివైచెదను. ఎట్లైన నీగడవుదినములలో వైదేహివార్తతీసికొని రావలయును.

అందరు.—ప్రభువాజ్ఞ శిరసావహించి కార్యమును నెరవేర్చికొని వచ్చెదము.

రాము.—అంజనేయా; అందఱికంటె దక్షిణదిశాన్వేషణార్థ మరుగువాడవగుటచే నీయందెక్కువ కార్యభారము మోపబడియున్నది. నామనోదృష్టి యహర్నిశలు సీతాక్షేమమును దెచ్చు నీరాకకెదురు సూచుచుండును. నీకందు ప్రాణవల్లభ కనపడెనేని యామెతో నిట్లనుము.

సీ. దనుజాప హృతవంచు ♦ విని బ్రోవలేక జీ
వచ్ఛవంబుగ నిల్లు ♦ బ్రతికితనుము
పాణంబులైదు నీ ♦ పయినిల్పి కొనయూపి
రినిమాత్రమేకల్గి ♦ మనితినసుము
నినుమదినెంచి క ♦ న్నీరు నింపనివేళ
యేలేదనుచు వచి ♦ యించి తనుము
నీయున్కి వినవెంట ♦ నేదైత్యుద్రుంచి ర
క్షించెదనంచు వ ♦ చించి తనుము
గీ. సమయ మరుదెంచునంతకు ♦ సైపుమనుము
అజుని విధిదాట దరముగా ♦ దంటినసుము
కనులుమూసుకు గాలంబు ♦ గడుపు మనుము
పొగలకుండగ ధైర్యంబు ♦ బూనుమనుము.

హనుమన్నా! జానకి ఈమెయే యనితెలిసికొనుటకు నీకుగొన్ని యానవాళ్లు చెప్పుచున్నాను. పద్మినీజాతి స్త్రీయగుటచే సీత యున్నప్రదేశమంతయు బద్మసుగంధముచే వ్యాప్తమగును. సర్వలక్షణ సంపన్నమైన ముఖచంద్రమండలంబున నిందీవరం బులబోలు విశాలనేత్రములు భాసిల్లునది. బంగరుతీవ వంటి మేనుగలది. మిక్కిలి పొడవును కురుచయు కానిది. నన్నువిడ చియుండుటచే నసంస్కార కచభారముకలది. సాధ్వీలక్షణ ములు కలది. భ్రూమధ్యమున విభూతిరేఖకలది. వీటినిబరికి లించి జానకి యనితెలిసికొనుము. మరియు నను క్షణమునన్నే స్మరించుచుండును. నిన్నుగాంచి యామె రామ దూతవని విశ్వసించుటకు నా పేరుగల యంగుళీయ మిదియే కైకొనుము. (ఇచ్చును.)

ఆంజ—(రామాంగుళీయముగొని కనులనద్దికొని) మహాప్రభూ; చిత్త ము. అట్లే చేసెదను. మహాప్రసాదము.

చం. దొరికెను నాకునేఁడుముని ♦ దుర్లభమైన భవాంబురాశినం
    తఱనపవిత్రనాక విబు ♦ ధప్రకరంబు కిరీట రాజమం
    దిరవుగదాల్చురత్నము మ ♦ హోవలయాధిప రామనామ భా
    సురమగునంగుళీయము త్రి ♦ శుద్ధిగమౌళి ధరింతు నీయెడన్.
    (ఉంగరమును మస్తకమున బెట్టుకొని గంతులు వైచుచు)

(7) పాట.

రాము—హనుమన్నా ! నాయందలిభక్తియే నిన్నుగార్య సాఫలము నందిన వానిగా జేయును. నీకుభద్రముకలుగును. పొమ్ము.

సుగ్రీ—నేనుంచిన గడవుదినముల మఱువకుము. పోయిరమ్ము.

హను—చిత్తము—

(నిష్క్రమించును.)



రంగము—పర్వతము

(హనుమదాంగద జాంబవంతాది కపులు ప్రవేశించెదరు.)

అంగద:—హనూమంత, జాంబవంత, కపులార ; మనమందఱముగాఢాంధకారపర్వత గుహనుండి సూర్యాన్వయంప్రభకరుణాకటాక్షమున బైలుపడి యందుండి యింతవఱకుగల ప్రదేశంబులగాలించియు జానకీదేవిజాడ గనుగొనలేకపోయితిమి.ఇప్పటికి దక్షిణసముద్రముదరికిజేరితిమి. యికనన్వేషింపదగిన భూమియేలేదు. మనప్రభువునిర్ణయించిన మాసముగడవు దాటినది. యిప్పుడు మనమేగి పూజ్యుడైన శ్రీరామచంద్రునిదర్శించినచో భార్యావియోగసంతప్తహృదయుడై యాతఁడుమనపై నలుగును. సుగ్రీవునియాజ్ఞయా, అవిలంఘ్యము. సహజకోపుడైన సుగ్రీవుడు

మనలఁదప్పక వధించితీరును. ముందుభవితవ్యమేదో యోచింపుము.

హను:—అంగదా! ఇట్టివ్యర్థవాక్యమును బ్రభువులతో విన్నవించుటకు మనకుమొగమెట్లుచెల్లును. కావున మనకందఱకుమరణమే శ్రేయమువలెగనుపట్టుచున్నది. కటకటా; శ్రీరామచంద్రా నీకార్యమునకు సమస్తభూతకోటియు సహాయపడుచుండ మనముపకారము సేయలేకపోతిమను విచారము నన్నుదహించుచున్నది.

సుగ్రీ:—అట్టివిచారవహ్నిసంతాపముమనలందఱిని దహించుచున్నది. చివరకు బక్షికులుడైన జటాయువంతవాఁడు, సహాయ్యైదేహిని దస్కరించుకొని గగనమునుండి పోవురావణునెదుర్కొని తన ప్రాణముల గోల్పోయినాఁడు. మనమందులో సహస్రాంశమైనయుపకారముసేయలేకపోతిమి. కావున మనము ప్రాయోపవేశమున బ్రాణముల బాయుటయే యుక్తము.

సంపాతి:—(ప్రవేశించి తనలో) అధికక్షుధాగ్నిచే జిరకాలమునుండి తపించు నాకాహారముగా నీవానరులనిందు భగవానుఁడు ప్రవేశింపజేసినాడని సంతోషించితిని. కాని వీరు శ్రీరామకథావృత్తాంతమును నాతమ్ముఁడు జటాయువు సంగతిని చెప్పుకొనుచుండుటచే వీరలభక్షింప బుద్ధికలుగుచున్నది. (కపులసమీపించి) వానరులారా; మీరేకార్యమునకై యిచ్చోటజేరితిరి. శ్రీరాముని కథను జటాయువు నుదంతమును జెప్పుకొనుటకేమి హేతువు? ఆవార్తను వినవేడుక పడుచున్నాను. ఆనతీయుఁడు.

అంగద:—ఓపక్షిప్రభువా! రఘుకులతిలకుఁడైన శ్రీరాముఁడుభార్యయైనసీతతోడను తమ్ముఁడైన లక్ష్మణుని తోడను అరణ్యవాసముసేయవచ్చి దండకారణ్యంబున జానకిని గోలుపోయి యామెనన్వేషించుచురాగా నొక్కచోట ఖండితపక్షుడై పడియున్న

జటాయువను పక్షినాథునిగాంచ నాఖగేంద్రుండు సీతనురావణుడు తప్పించి కొంపోవుచుండ దానువానితో బోరిరెక్కలనరుకబడితిననియు రావణుండా వైదేహిని గగనమార్గంబున గొంపోయెననియు జెప్పినాడట, మేమిపుడా శ్రీరాముని పనుపునను రామసఖుండైన సుగ్రీవుని యానతిచేతను జానకీదేవినన్వేషింపవచ్చి యెందును మైథిలిజాడ నరయలేక యింక బ్రాయోపవేశమున బ్రాణముల బాయదలచి పక్షులు సైతమురామకార్యమునకై ప్రాణములర్పించెనే ; మనముపకారము సేయలేకపోతిమని చెప్పుకొను చున్నాము.

సంపాతి:—హా, సోదరా ! జటాయూ ; మనమునాడు భానుమండలమును గవిసినప్పుడా ఖరకరుని వేడివెలుంగులనీవు కమలిపోవుచుండనా రెక్కలడ్డుపెట్టి రక్షించితి ! నీవిప్పుడు దుష్టరావణుని కతంబున మరల రెక్కలకాపాటవము సంభవింపమరణించితివా ? తమ్ముడా ! కాని పురుషోత్తముడైన శ్రీరామునినిమిత్తమై ప్రాణముల నర్పించినవాడవగుటచే నీవుపుణ్యలోకసౌఖ్యము ననుభవింతువుగాక !

హను:—ఓయీ ! నీనామమేమి ? నీవు మాకాప్తుడైన జటాయువు సోదరుడ ననుటచే నీయందు మాకధికభక్తి విశ్వాసములు కలిగినవి. నీవు వైదేహివార్త నెఱింగినచో జెప్పిమమ్ముద్ధరింపుము.

సంపా:—వనచరులారా ! ఎలుగుదు నొకనాడు గగనంబునుండి పోవుచుండ "హా రామా ! లక్ష్మణా !" యని కన్నీరుగా విలపించుదాని, భువనసుందరిని అలంకార రహితను, సీతనాదురాత్ముని రథమున నున్నదానిని, దిలకించితిని. అప్పుడు మితిమీరించిన యాగ్రహము కలిగెనుకాని భానుమండలతీక్ష్ణమరీచికలమాడిపోయిన పక్షముల కలవాడగుటచే శక్తిలేక యూరకుంటిని. వాడామెను లంకలోనికిం గొంపోయి రాక్షసకాంతలరక్ష

ణమున నుంచినాను. లంకయిచ్చటకి నూరుయోజనములదూరమున్నది. ఇయ్యది శ్రీరామకార్యమగుటచే మీలోసమర్థుడైనవ్వడో వాయుపథంబవలంబించిపోయిన నచ్చోటికి జేరగలడు. వానికవశ్యము జయము కలుగగలదు. మీరునిరుత్సాహము నందివిచారింపక ప్రయత్నించుడు. నాతమ్ముడు జటాయువునకునుదక క్రియలాచరింపవలయును. నన్నుగొంపోయి యాసముద్రతీరమునకు జేర్పుడీయుపకారము:రింపుడు.

అంగదు:—ఖగేంద్రా ; అటులేచేసెదము. వానరులారా ; యీపక్షిరాజును సముద్రతీరమున జేర్చిరండు.

వానరు:—చిత్తము—

(పక్షినిగొంపోవుదురు. మరలవచ్చెదరు.)

అంగదు:—జాంబవంతాది వానరులారా ; శతయోజనవిస్తీర్ణవారాశినిలంఘించుటకు మీ కెంతశక్తిగలుగుచున్నదో తెలుపుడు. నేనుఆవలియొడ్డున జేరగలనుకాని మరలరాలేనని భీతికలుగుచున్నది.

వానరు:—మాలోనెవరికిని అంతమాత్రపుశక్తికూడ లేదు.

జాంబ:—యువరాజా ! నేను అనేకయుగముల నాటిముదుసలిని. నేనునుదాటలేను. కాని ఈసముద్రతరణమునకు నర్హుడైనవాడు వాయునందనుండు తప్పమతెవ్వరును లేరు. అతనిబలంబాతడెఱుంగడు. నిజముగ నీపయోరాశి మనహనుమన్నకుపల్వలప్రాయము. ఏమి, ఆంజనేయా ! ఊరకచూచెదవేమి ? నీవంటిమహాబలసంపన్నుడు, నీవంటిపరాక్రమైకనిధి, మాకుకొంగుబంగారమై యుండనీస్వల్పకార్యమునకు యేమింతయోజింపవలయునా ? లెమ్ము. సముద్రలంఘనమునకు బ్రయత్నింపుము;

అంగదు:—మహాబలనందనా ; నీప్రభావమనవద్యము. మాలోకాదుగదా ; చతుర్దశభువనంబులందును నిన్నుబోలినవిక్రమసింహులులేరు. నీసత్యప్రశస్తినెఱిగి యుంటినిగనుగనేముందుగ బెరవారలశక్తినడిగితి. ఇదిశ్రీరామకార్యము. నీవు శ్రీరామభక్తుడవు.

అంతియకాక ఈకార్యభారమంతయు ప్రభువులచే నీమాఁదియం దుంచబడినది. లెమ్ము. సముద్రము దాఁటుము. నీకీర్తిచంద్రికలన ఖిలదిశల వెలిగించుము.

హను:—(లేచియాటోపించి) మిత్రులార ; వానరులార ; ఇదిగో ; నాపరాక్రమమును జెప్పెద నాకర్ణింపుఁడు.

సీ. చేయుదునా హేమ ♦ శిఖరికివేయిపరి
దక్షిణాలోకముహూ ♦ ర్తంబులోన
ముంతునాపదునాల్గు ♦ భువనాళిబాణివి
క్షేపితాబ్ధిజలాన ♦ జటికలోన
విసరుదునా వార్ధి ♦ వినువీథికురుదేహ
వాయుతీవ్రతజెప్ప ♦ పాటులోన
ఎగురుదునా వార్ధు ♦ లేడింటికవలికి
నవలీలగాను క్ష ♦ ణంబులోన

గీ. తిరుగుదునోవేయి సారులా ♦ తరణిచుట్టు
నుదితుఁడై యస్తమానంబు ♦ నొందులోన
ఆక్రమింతునోదెసల దే ♦ హంబు బెంచి
యమరులబ్బురపడి చూచు ♦ నంతలోన.

అంగ:—ఆంజనేయా ! నీకట్టిపరిభావనసంపద కలదుగనుక నీవీకార్యమునకు దగినవాడవని ప్రత్యుత్థానము నేయుచున్నాము.

సుగ్రీ:—సందియమేల ; హనుమంతుఁడు కారణాంతరమున నిట్లుదయించినవాఁడు కాని కేవలవిశ్వమూర్తియే ; ఆంజనేయా ; ఇకజాగేల ; అదిగో, మహేంద్రాద్రి. దానియున్నతశిఖరము నధిష్ఠించి జలరాశినుత్తరింతువుగాక. రమ్ము. సర్వథానీకుజయంబౌకలుగును. నీకునష్టమారుతకులు తోడుపడును.

హను:—పెద్దలయాశీర్వచనము శిరసాధరించితి.

(నిష్క్రమించెదరు.)

శ్రీ

# లంకాదహనము.

పంచమాంకము.

రంగము—లంకాపురకవాటము.

హనుమంతుడు ప్రవేశించును.

హను—శ్రీరామకరుణాకటాక్షమునలంకాపురసింహద్వారమును జేరితి.

గీ॥ ఇంకఘోరాసురులతేజ ♦ మింకగలద
టంచుదెల్పెననంగన ♦ హస్కరుండు
చప్పజల్లారినట్టితే ♦ జంబుతోడ
నస్తగిరికందరమ్మున ♦ నస్తమించె.

ఈసింహద్వారమును భేదించిపురములో బ్రవేశించుట కిదియేమంచి సమయము. ఆహా! ఈలంకాపురప్రాకారమే యింతశోభ వహించియుండ బురమెంతరమణీయముగ నున్నదో,

ఉ. ఆకసమంటుచున్నశిఖ ♦ రావళికుడ్యముల్లెల్లచారుచా
మీకరవారి పూరితమ ♦ మేయమణీనివహప్రకల్పితం
బైకర మొప్పెస్వర్గపుర ♦ మట్టులనీపురమేలువారు సు
శ్లోకులు యోగ్యులేయయిన ♦ నీకులభాగ్యము నెన్నశక్యమే॥

కావుననే పరమేష్ఠి సంపదల నొసంగి సద్గుణముల నొసంగకుండును.

„హుం" నాకీపురవైభవముతో బనియేల? ఈకవాటమునొక్కపాదప్రహారమున భేదించెదను. (తన్నును.)

(లంక వికృతరూపముతో బ్రవేశించును.)

లంక—ఓరోరి, మర్కటాధమా, నీవెవ్వడవు? ఎందుండి ఏమిపనికై సముద్రముదాటి వచ్చితివి; సురేంద్రభయంకరుండైన మా రావణ బ్రహ్మశాసనమతిక్రమించి వచ్చిన నిన్నిప్పుడే వధించె ద. నిక్కముజెప్పుము.

హను—ఓసీ! నావృత్తాంతమవలజెప్పెదగాని ముందుగనీవెవ్వతెవో నీయుదంతమంతయు దాచకచెప్పుము?

లంక—నేనీలంకాపుర రక్షకురాలను. లంకయను దానను. నాయాజ్ఞలేకుండ నిందెవ్వరు బ్రవేశింపనలవికాదు. నీవెందులకు వచ్చితివి?

హను—నేనీ లంకయందున్న సౌధములదానవులను ద్యానవనంబుల జూచిపోవుటకువచ్చితి. వానరుడను. నేనవన్నియు జూచివచ్చిన పిమ్మట నీపని జక్కజేసెదను.

8 పాట పైలాగు

లంక—ఔరా! కోతిగానికి గండకొవ్వెమెంతుగనున్నదే; ఇదిగో; నాపిడికిటపోటుచే జచ్చినరక లోకము జూడబోవుము.

(హనుమంతుని వక్షమున గొట్టును.)

హను—ఓసీ! నిశాటి! స్త్రీవగుటచే నిన్ను జంపనొల్లనుగాని శిథిలీకృతశరీరిణిగాజేసెద—(కొట్టును. లంకకూలును.)

లంక—ఓహో! వానరనాయకా, బ్రహ్మవాక్యములు నాకిపుడు స్మృతికి వచ్చినవి. ఎప్పుడు శ్రీరామదూతయగు వనచరుండు సీతను వెదుక నీలంక బ్రవేశించి నిన్ను ముష్టిఘాతంబున గూల్చునో అదిమొదలు లంకావినాశము ప్రారంభమై యనతి దినములలో పుత్రమిత్రబంధు గణముతో రావణుండు హరించునని చెప్పినాడు. నీవిక పురములో స్వేచ్ఛగా బ్రవేశించుము. నీకుజయము కలుగును. నీకనేకవందనములు. నేపోయెద.

—మంచిదిపొమ్ము. ఇదియొకమంచి సుశకునము. పురములో బ్రవేశించిదేవిని రోసెదగాక?

(నిష్క్రమించును.)

రంగము—సౌధాంగణము.
హనుమంతుడు ప్రవేశించును.

---

—చూచితి. సర్వస్థలముల వీక్షించితి ననేకశుద్ధాంతముల నవలోకించితి. పెక్కుకేళికాగృహముల రహస్యస్థలములబరిశోధించి మదనపరవశదానవాంగనా సంతతుల నరసితి. పాపముగట్టుకొంటినని సంకోచించితి. రామకార్యము కిల్బిషహారముకదాయని ధైర్యమవలంబించితి. సభార్యుడైనరావణు నీక్షించితినెంమను మాతల్లి వైదేహిజాడకనుపడదయ్యె. రావణుండుకొనితెచ్చువేళ వసుధిగాంచి భయపడి జాటిజలముల బడియంతరించెనో, హా, రామా, రామా, రామా, యనివాపోయి ప్రాణము కడంటి మృతిజెందెనో; కినుకచే దశకంఠుండు ఖరాసికిబలివెట్టెనో; రాక్షసాంగనలు భక్షించిరో.

9 పాట ఎంతా వెతకిన

తెలియదయ్యె. కటకటా; ఇంతశ్రమనందియు కార్య సాఫల్యముగాంచనైతినికదా? ఇకగత్యమేమి? ఓ హరిహరబ్రహ్మేంద్రాది దివ్యులార! ఓభగవానుడా; భానుడా; శ్రీరామచంద్రా; మహానుభావ; ఓవానరప్రభువా; సుగ్రీవా; మీకందరికి వేవందన సహస్రములు. నేవచ్చినకార్యమును సఫలముజేయుడు. (ఆలోచించిచూచి)అదుగో, కువలయనాధుండు చంద్రుండుదితుండై వెలుగు చూపుచున్నాడు. ఇదిగో, నీకేళివనొక్క వనంబుకనుపట్టుచున్నది. అయిననివనముగూడబరిశోధించెదను.

(నిష్క్రమించును.)

రంగము—అశోకవనము.

సీత-రాక్షసస్త్రీలు ప్రవేశించెదరు.

సీత—శా॥ హా రామా; రవివంశ వార్ధిహిమధా♦మాసద్గుణారామయో
శ్రీరామా! అసురుండు బల్మినసురదె ♦ చ్చెన్నో ప్రవరా,హా! భవత్
కారుణ్యామృతవృష్టినింపుము జగ ♦ త్కళ్యాణసంధాననీ
1 గారా రక్షణభారమా శ్రితజన ♦ తాణుండవై రాఘవా.

హను—(ప్రవేశించి)అదిగో! ఇచ్చట శ్రీరామసంస్మరణము వినబడు చున్నది. (చూచి నెమ్మదిగ గంతులిడుచు)ఆహా! కనుగొంటిని. మాతల్లిని మాయమ్మను వీక్షించితి. జానకీ దేవి వినాయిందు రామునిబేరొక్కను వారెవరు?

రక్తాక్షి—సీతా! ఎప్పుడునొకటే యేడుపా! మమ్ము నిద్దురబోనీకుండ జంపుచుంటివికదే! ఆరాముడులంకకు వచ్చునా, నిన్ను రక్షించు నా! ఎందులకీ యరణ్యరోదనము; హాయిగా మారావణ బ్రహ్మబాహుపంజరమ్మున ముద్దులచిలుకవై సౌఖ్యపడరాదా?

హను—(తనలో)ఓసీ, రాకాసి ముండలార, మిమ్మందఱియు మునిని శాతశూలా పంజరమునబెట్టినగాని మాయమ్మయట్లు సేయదు.

శ్వానవదన—ఓసీ,రక్తాక్షీ! ఒక్కసారినేను బొయ్యిమని యఱచి దీని గుండెలగలించి నాకోఱలచవి జూపిన గాని ఈజానకి నమ్మతిం పదే; తనకు కాబోయేలంకాపురమహారాణిమెత్తని మేనెక్కడ గంట్లుపడునోయని రావణబ్రహ్మ అజ్ఞనీయలేదు కాని ఒక్క సారి ,,ఊ”అని యన్నచో మంచిదని యనిపింపకుందునా?

హను—ఓసి కుక్కమూతిముండ! అప్పుడు కుత్తుకబిగించి చంపుటకు నాతోకలేదను కొంటివా?

(తెరలో)రాక్షససార్వభౌమా; ఇటుఇటు.

అదుగో! రావణుడువచ్చుచున్నట్టున్నది. నేనీయశోకనగమునెక్కి దట్ట

ముగనున్న యాకుఁజొంపములో నడగివీని భాషణము లాలించెదను—[అట్లుచేయును.]

[రావణుడు దుర్ముఖి ప్రవేశించెదరు]

రావ—రక్తాక్షీ,శ్వానముఖీ,ఏమి,సీతనన్నేలుటకు సమ్మతించెనా,లేదా?

రక్తాక్షి—స్వామీ; మేమెంతనయభయముల జెప్పినను సమ్మతింపలేదు.

హను—[స్వ]ఓరీ,నిశాటాధమా! నిన్నిక మృత్యుదేవతయే పరిగ్రహించుటకు సమ్మతిజెందును.

రావ—జానకీ, ఇంకనూ నీమతిమఱలలేదా, వినుము.

మ॥ అమరస్త్రీలు కెలంకులన్నిలచి స్వశ్రీ గ్ణాంభోజపత్రాళిని
శ్రమబిందుల్ హరియింపవీవగబడా ♦ జ్జంభోత్తమందోదరీ
రమణీరత్నము హేమరత్నమయ ప ♦ ర్యంకంబునన్ నన్నుజే
రి; మహారాణివిగానపారసుఖపూ ♦ ర్తిన్గాంచుటల్ చేదటే.

సీత—హా,పాపిష్ఠ, లంఘిష్ఠ;

మ॥ తృణమా, నీవశమా! మహాగ్ని కణసం ♦ దీప్తిన్స్పృశింపంగగాం
తిని వీక్షించు మలోభమందెదవు సం ♦ దేహంబులే కుండమా
రణమై భస్మము జెందెదీవు సుమిగ ♦ ర్వంబింకజాలించి భ
క్తిని శ్రీరాముని నన్ను జేరిచిసర ♦ క్షించున్ జుమీదాప్ష్యమా.

రావ—ఓసీ; వెఱ్ఱిసీతా; నీవింకనూ రామునిమీది ప్రేమమును విడువలేదా; వారిపాటికి దండకారణ్యమునందు మాకబంధుని చేత మడిసియేయుందురు. అంతియెకాక వాడేటిమగడేనీకు? బింబఫలము శుకరాజమునకు దగునుగాని కాకమునకుదగునటే; ఇసీ; నీవెంత తెలివిహీనురాలవే?

ఉ. తమ్ముడు రాజ్యముగ్గొనగ ♦ దండిరి యదృష్టవిహీనుడంచర
ణ్యమ్ముల కంపివేయగన ♦ నాథవిధంబుననేడ్చి కట్టుపు
ట్టమ్ములతో మృగావళికి ♦ తావగు కానజరించునట్టి పె
ద్దమ్మను రాముగొల్తువటె ♦ తన్వీరో. సిగ్గొకయింత లేదటే.

సీత—ఛీ! ఛీ! పరమచండాలుడా; నీనాలుక వేయి చీలికలుకా వల దా; పరమకళ్యాణగుణుని, త్రిజగన్నుత పవిత్రచరిత్రుని నిందించెదవా; దురాత్మా; చంద్రునిగాంచి జంబుకము మొఱగి నట్లు శ్రీరామచంద్రుని దివ్యమంగళచరిత్రము నీకమంగళము గదోచుకాక. ఆమహానుభావుడు, ఆసకలలోకాభిరాముడు, నా జీవితేశ్వరుడు. నాప్రాణవల్లభుడు. ఆతనినామ ముచ్చరించుట కైన నీవుతగవు. ఆవలకుబొమ్ము. నన్నునీవు యతివేషంబున నస్కరించినప్పుడా రఘుకులజరుడేయున్న నీమాటలుసాగునా; నీపదితలలు ద్రెంపబడి తన్మాంసంబీపాటికి కాకగృధ్రములు బ్రవేశించి హరించిపోవకుండునా; నిశాటాధమా;

రావ—ఓహో! ఆరాముని నీవేమెచ్చుకొనవలెను. అట్టిపరాక్రమనిధియేయైన కూటికి గుడ్డకు మొగమువాచి యరణ్యములపాలుకానేల? సుంతయోజించుకొనుము. నీవు నన్నునిందించినను సన్నుతులగానెంచి సంతోషించెదను. నీ సౌఖ్యసామ్రాజ్యము వినా నాకుసకల సామ్రాజ్యములునుగలవు. ఆలసింపకుము.

సీ. కలహంసయానవ ♦ స్థ యుకుండినను ది
వ్యాధికసౌఖ్యంబు ♦ నందగలవె
పూబోణిదశకంఠు ♦ పాలతివికాకున్న
శ్రీమహారాణివై ♦ చెలగగలవె
చెలియ! రావణుబాహువుల ♦ జేరకుండిన
బంచాస్త్రతాపంబుబా ♦ యగలవె
చేడరోనాతోడ గ్రీడ ♦ లాడకయున్న
వీరసంతతులు ల ♦ భింపగలవె

గీ. వేయి వచియింపనేలయీ ♦ విశ్వమందు
నీకు సరిలేరటంచున ♦ న్నించువాడ
బిరబిరగరమ్ము నాచిటి ♦ వ్రేలుగొమ్ము
కౌగిటకురమ్ము సకలసౌ ♦ ఖ్యములుగొనుము.

సీత—ఔరా, పాపాత్ముడా;

మ. శతధాభిన్నముకాదె నీరసనశీ ♦ ఘ్ర శ్రేణియుగ్ దుర్మదో
ద్ధతిసిరీతిగ ఘోరవాక్యముల బ్ర ♦ స్తాపించె దేనాపతి
వ్రతశక్తిన్నిను బూదిసేతునయిగ్ ♦ రామాజ్ఞ లేకుండెమో
చితకీపాటి స్వతంత్రమున్ననినుభ ♦ స్మీభూతినిగ్ సేయనే.

కావున బుద్ధితెచ్చికొని యవలకుబొమ్ము. నీవునిక్కముగ బరాక్రమ వంతుడవేనైన నానాథుండు పర్ణశాలలోలేని సమయ మరసి శ్వానము సింహముగుహాలోలేనిసమయమున దానిభోజ్యమును హరించినట్లు నన్నుగొనితెత్తువా? మూఢా;

రావ—కాంతాలలామా; నీయూహానాకుదెలిసినది. నీయందునా కెంత యనురాగమున్నదో పరీక్షించుటకై నన్నిట్లుతూలనాడుచు న్నావు. నిజముగా దైవసాక్షిగా నాపంచప్రాణములు నీయ ధీనములు. నీవు నీమగనికి భీతిజెందుచున్నావు. ఆతడీజలరాశి దాటిరానేలేడు. వచ్చినను మారాక్షసవీరులచే మ్రగ్గగలడు. ఒకవేళ వారలగెలిచిన మాకుంభకర్ణుని నిశ్వాసమారుతమునకు గొట్టుకొనిపోయి వారాశి కావలియొడ్డున బడగలడు. అంత కును నిలిచిన వజ్రినిగెలిచి దేవరాజ్యమాక్రమించికొన్న నీశర శరాసనముల బంచత్వము నందగలడు. నీవికెందులకును సం కోచింపకుము.

10 పాట—ఎందులకీకుందు

హను—(స్వ) నీబాణంబులా రామచంద్రుని బంచత్వము నందింప లేవు. కానినీవు పంచత్వమందుట నిక్కమురా; మూఢా;

11 పాట. ఓరోరిరావణా॥

సీత—ఓరీ! త్రపావిహీన, కామాంధకారముగగనన్నుగానక ప్రేలకుము. ఏపరాక్రమసింహముని బాణము సుబాహు మారీచాదుల దూ

లించెనో యఘోరశస్త్రము జనస్థానమందున్న మీ ఖరదూషణ త్రిశిరస్కప్రముఖరాక్షసుల నిర్మూలముగావించెనో, అట్టి శ్రీరామచంద్రుని దివ్యాస్త్రములు నిన్ను సకుటుంబ సబాంధవ సామాత్య సపరివారముగా నాశముసేయగలవు. నీయొక్క నికామపీడనమువలన గుణక్షయముజేసికొనుట నీతికాదు. ప్రతాపము కాదు. పరాక్రమము కాదు. శ్రీరాముడు కరుణాసముద్రుడు. శరణాగతరక్షకుండు. ఇప్పుడైనను నన్ను గొంపోయి యామహాత్మున కర్పించి శరణంటివేని నిన్ను రక్షింపగలడు. ఎందులకిట్టి తుచ్ఛసుఖమునకాసించి వంశనాశనముజేసికొనెదవు. నీవు బ్రహ్మవంశమం దుదయించియు నిట్టియమంగళకార్యముల నాచరించిన నిదాఘనదీ జలంబులమాడ్కి నీసంపదలు నీవు హరింపగలవు. ఇదివఱకే యనేక నాగనర గంధర్వకిన్నర యక్ష సిద్ధసాధ్యామర సాధ్వీలలామల వేడికన్నీళ్లువరదయై హ్రదమైనిండియున్నది. ఇప్పుడాహ్రదమున నాదుఃఖాశ్రువులుగూడజేరుచున్నవి. అదినేడో రేపోనిండి కట్టుతెగి యాప్రవాహమువచ్చి మీవంశంబునకుప్పెనయైముంచి నాశనముసేయగలదు. కావున మారాడకుము. విమలమైన యంతఃకరణముతో యోజించుకొనుము. పొమ్ము.

రావ—ఛీ; సీతా; నీభాషణమ్ములకు నావంటివాడు భీతిజెందునను కొంటివా? నన్ను బరిగ్రహించెదవా? లేదా; నిన్నుఖరాసికినెఱజేయనా? వేగజెప్పుము.

సీత—హా శ్రీరామచంద్రా; ప్రాణవల్లభా; రక్షించుము. రక్షించుము.

హను—(స్వ)ఇప్పుడు వీనిపదితలలుతోకజుట్టిపెనవైచి పెకలింతునా ; (ఆలోచించి)త్వరపడుటకిదిసమయము కాదు.)

సీత—

సీ. హా రామ సీతామనీ ♦ రావణుని బారి
నుండి రక్షింపరా ♦ కుంటి వేమి?
ఓ దివ్యవరులారయా ♦ దైత్యుల నడంచి నా
ప్రాణంబు రక్షింప ♦ రా రేదేమి?
ఓ రవీ యా దశాస్యుని ♦ ద్రోసి నీ యింటి
కోడలి నను బ్రోవ ♦ జూడవేమి?
ఓ నవగ్రహములా ♦ రాసన్ను సురపీంతి
పాలుగాకుండగా ♦ పాడరేమి?

గీ. పుణ్యవిభవులార ♦ పురుషోత్తమముఖులార
అనదనై నన్ను ♦ మనుపరేమి
ధర్మదేవతామ ♦ తల్లి నీయాశ్రితు।
రాల నన్ను వేల ♦ రావె తల్లి ॥

(ధాన్యమాలి ప్రవేశించును.)

ధాన్య—ప్రాణేశ్వరా: అనంగక్రీడయందింత అసహ్యము నొందుదానితో మీకేమి సౌఖ్యము. రండు. పోవుదము. పుష్పవనంబునకు—
(చేయిపట్టుకొనును.)

రావ—రక్తాక్షీ; శ్వానముఖీ; మీకింక నొక నెలగడవిచ్చితిని. ఈలోపు నన్ను వరించునట్లు బోధించుడు. వినకున్న నాయాజ్ఞ లేకుండగనే ఈదురాత్మురాలిని భక్షించివేయుడు—
(ధాన్యమాలితో నిష్క్రమించును.)

రక్తాక్షి—సీతా; వింటివిగదా! మాప్రభువాజ్ఞ, హాయిగాదిని కుత్తుకబంటిదాక త్రాగి సకలవిధసౌఖ్యములననుభవింపలేక తెగసాగుచున్నావు. తీపుదిగదీసినదా, ఏమి?

శ్వాన—బల్లెంపుపోట్లు రుచిచూచినగాని ఈసీతకా రుచి యెట్లు తెలియునే; పోనిమ్మ. దానికర్మను దీనివలన మనముగూడ నిదురలేక

చావనేల; సుఖముగా నిద్రపోవుదము. మునుగుదమ్ము ము.

రక్తా—ఔను; హా,రామా; రామాయని సీత యేడ్చును. గాని మన కేల? నిదురబొమ్ము.—(నిద్రింతురు.)

సీత—ఈనాటికీ పీడవదలినది. ఈదనుజకాంతలు నిద్రించుచున్నారు. నాథా; శ్రీరామచంద్ర: సుగుణసాంద్ర!

సీ. లక్ష్మణు దుర్భాష ♦ లనుబల్కినానని
సీతపై నలుకను ♦ జెందినావొ
ఆపర్ణశాలనన్నరయ ♦ జాలకయుల్లొ
మృతిగాంచినానని ♦ యెంచినావొ
నాజాడవనులగానకన్పు ♦ హతజెంది
ఫలము లేదని మది ♦ దలచినావొ
కడగండ్లలోమనః ♦ కాంతనుబాయుట
మంచిదేయనుచు నూ ♦ హించినావొ

గీ. మదిని వైదేహిపై ప్రేమ ♦ మరచినావొ
వనితలేదనిశోకాబ్ధి ♦ మునిగినావొ
తిరిగి వేసరి యొందైన ♦ నొరిగినావొ
పురుషసింహామ నీభార్య ♦ బ్రోవరావొ.

హను—రాక్షసాంగనలు గాఢనిద్రాపరవశులైనారు. మాతల్లితో ప్రస్తావనసేయుటకు నాకిదియే మంచిసమయము. (చెట్టుదిగి) ఈమెనన్ను విశ్వసించునట్టున్ను దుఃఖపరవశయైన సీతాదేవితాపము నుంతి చల్లారునట్లు రామస్మరణామృతమును వెదజల్లెదను గాక;

ఉ. శ్రీరఘురామ సర్వజన ♦ సేవితరామ సుబాహుదైత్య సం
హారణరామ కౌశికమ ♦ హాధ్వర రక్షణరామ పాద పం
కేరుహధూళిచే శిలను ♦ కిల్బిషముల్ హరియించికాంతగా
మార్చినట్టిరామగుణ ♦ మండన జానకిరామ కావుమా.

సీత—ఏమనుచెప్పెదమా, క్రూరరాక్షసస్థానమైన యీలంకాపురమున రామస్మరణజేయువాడు. అదిగో; నచ్చోటనొకవానరమగుపించుచున్నది. నన్ను మోసపుచ్చుటకై పీడిట్టి మిథ్యారామభక్తి నగపఱచుచున్నాడు. ఓరీ; రావణా; తృణమా; నన్ను మోసగించుటకిట్టి వానరాకృతిని దాల్చి వచ్చినావని యెఱుంగుదును. అవలకుబొమ్ము.

హను—తల్లీ! ఆశ్రితజనకల్పకవల్లీ! సీతామతల్లీ; ఎవ్వాడుకౌసల్యాగర్భక్షీరాంభోధినీహారకిరణుండో, ఎవ్వాడుదశరథమహీపాల తనూద్భవతిలకుండో, ఏపరాక్రమైకనిధి తాటకను బాహాదులగీటడంచి విశ్వామిత్రయాగసంరక్షణముజేసెనో, ఏపరమపావనుడు శిలన హల్యగావించెనో, ఏవిక్రమసింహుడు శైవచాపవిదారణమొనరించి జనకరాజపుత్రివైన నిన్ను బరిగ్రహించెనో, ఏధర్మనిరతుండు జనకవాక్య ప్రతిపాలనముకై యరణ్యావాసవిధికై నీతోడను లక్ష్మణుతోడను దండకారణ్యమున బ్రవేశించెనో, ఏమాయాతీతుడు మాయాకనకమృగలుబ్ధుండై పోయి నిన్ను గోలుపోయెనో, అట్టిశ్రీరామమూర్తిదూత, నీబిడ్డడు, యీవాయుసుతుండు, హనుమంతుండు, నీపాదకమలములకు నమస్కార శతంబుల నర్పించుచున్నాడు.

సీత—ఓయీ; నీకు భద్రములు కలుగుగాక; నీవువిశేషభక్తితో నా నాధుని నామస్మరణముజేయుటచే నీవు కపట వానరాకారుడవైన రావణుడవైనను నిన్నుదనయునిగ భావించితిని కాని దానవు లనేకమాయలు నేయువారగుటచేతను కామరూపధారణధౌరేయులగుటచేతను నిన్నునిక్కంపు రామదూతవని నమ్మజాలను.

హను—అమ్మా! రాక్షసబాధాసంతప్తమానసవైన నీవట్లుభావించుటసహజమే కాని యీరామచంద్రుండు నిన్ను బర్ణశాలలో

గానక పరితపించుచు నరణ్యమంతే వెతకుచుండ నొక్కచోట ఖండితపక్షుడై పడియున్న జటాయువువలన రావణాపహృత వైతివని తెలిసికొని ఎందుంటివోయని లక్ష్మణునును దానుది రిగి తిరిగి ఋష్యమూకగిరి బ్రవేశించి యందున్న మాప్రభు వైన సుగ్రీవునితో జెలిమిగావించికొని నిన్నన్వేషింప నాలుగు దిక్కులకు వానరకోటుల ననిపినేను మఱికొందఱు నీదక్షిణదిశ కువచ్చి నీవిందుంటివని సంపాతివలన నెఱింగి వారల నందుం చి నేనొక్కడ నీశతయోజన పరిమితిగల వారాశిదాటి వచ్చి పురమంతయు వెదకి మిమ్ముగానక తుదకిచ్చటికిజేరి మిమ్ముబొ డగాంచి యాసమయమున దైత్యాంగనలు మేలుకొని యుం డుటయు నంతనేరావణుడు వచ్చుటయుజూచి వారలకంటబ డిన గార్యహానియని నేనీయశోక నగమెక్కి యాకులయంద డగి రావణుదుర్భాషలన్నియు వింటిని. అప్పుడేరెచ్చిన కోప మున వాని మచ్చు మాపదలచితిగాని కార్యభంగమునకు జడి సి కోపముదిగమ్రింగి యోచించితిని. ఇప్పుడుసమయముకొదాయ నియోజించి మిమ్ముదర్శించితి. నమ్ముము నామాట. నేనునిజ ముగ రామదూతను.

సీత—ఈకథయంతయు దైత్యులుగూడ నెఱింగియుండగలరు. కల్పిం పగలరు. నాయనా: హనుమన్నా. అంతమాత్రమున నిన్నెట్లున మ్మగలనోయి; అయిన నానాధుడెట్టివాడు. లక్ష్మణుని లక్ష ణములెవ్వియోచెప్పుము? ఇంకను నేనమ్మదగినట్టి యానవా ళ్లేవైన నున్నవచింపుము. నమ్మెదను. అంతియేకాని నీవురా మదూతనని చెప్పినంతమాత్రమున నమ్మజాల.

హను—తల్లీ! దివ్యాధిక తేజోసమేతుడు జగన్నాథుండు శ్రీరాముడు. అట్టివానిని గోతిగాడను నేవర్ణింపగలుగుదునా! అయిన నేర్చి నంత వినుతించెద వినుము.

సీ. కమనీయనీలమేఘ ♦ శ్యామలాంగుండు
కళలీనువదన మం ♦ డలమువాఁడు
జగములుమోహింప ♦ దగుమూర్తికలవాఁడు
సిరికిఁతావైన పె ♦ న్నురమువాఁడు
బ్రహ్మాండములభరింపగల గ ♦ ర్భమువాఁడు
ద్యుతులీనుదీర్ఘ బా ♦ హువులవాఁడు
అఖిలకళ్యాణగుణా ♦ కరభావుండు
సర్వలోకములేల ♦ జాలువాఁడు

గీ. లక్ష్మణుఁడు సర్వసద్గుణ ♦ లక్షితుండు
సులభకోపుఁడు మిక్కిలి ♦ చురుకువాఁడు
మేల్మిరంగులనీను నె ♦ మ్మేనివాఁడు
నిగమవంద్యులువారు వ ♦ ర్ణింపదరమె.

మాతల్లివి నీవు, నాపదదోషము లిందేమైన నున్న రక్షింపుము. మృణ్మయ పాత్రములోని యమృతమట్లు వనచరుడను చపల మనస్కుడను అగుటచే నామాటలు మాఅమ్మ నమ్మక పోవచ్చును. ఇదే, మాప్రభువు శ్రీరామమూర్తి నామాంచిత స్వర్ణాంగుళీయకము. దీనినిగాంచియైన నన్ను నమ్ముము.

(ఉంగరము సీతకొసంగును.)

సీత—(చేకొని) హా, ధన్యురాలనైతిని [కన్నులనద్దికొని] ఓహో; ఎన్నాళ్ళకు నాప్రాణేశ్వరునివేళ్ళిలి కనకాంగుళీయమును గంటిని. ఓపవిత్రరామ నామాంచితాంగుళీయమా;

ఉ. శ్రీరఘురామమూర్తి సర ♦ సింహుకరాంగుళిమైత్రి సంపదన్
భూరిసుఖంబులన్గనుచు ♦ భూమిసుమారిక శోకవహ్నిజ
ల్లారుపవచ్చి నావె! కరు ♦ ణాత్ములు దీనులబ్రోచు పట్లవి
స్తారిస్వకీయ సౌఖ్యముల ♦ దల్పరుగా కనకాంగుళీయమా,

ఇది మాతండ్రి జనకమహారాజు నాచేతనా ప్రాణవల్లభుని కరాంగుళి నలంకరింపజేసిన హేమాంగుళీయము. నానాథుండు ముచ్చటపడి తననామాక్షరముల నాచే బ్రిబోధింపబడి చెక్కించుకొన్నాడు. ఆహా! ఎన్నాళ్ళకు జూడగంటిని. హనుమన్నా; నీవు నాపాలిటి భగవంతుడవు. నిన్ను నామనోనాథుని దూతగా నిప్పుడు విశ్వసించితిని. నాప్రాణరక్షకుడవీవు. నీవురాకమును పే నావేణీబంధమునుఱివై చికొని ప్రాణములబాయనుంటిని. ఆత్మహత్యమహాదోషమని వెనుదీసితిని.నాయనా! మారుతీ! నిన్ను దర్శింపగనే నాప్రాణవల్లభుడిందు వచ్చి రక్షించినంత యామోదంబునందితిని. నీవొనరించిన యీమహోపకారమునకు నీకుబ్రత్యుపకారముసేయ జాల. నీకివేపదివేలవందనంబులు. సందేహింపకుము. విపత్సముద్రమునుండి నుద్ధరింప వచ్చినవాడు, దూతయైనను వందనీయుడు. తండ్రీ! ఆపద్బాంధవా; నరవానర దుర్లంఘ్యమైన నీసముద్రలంఘన విక్రమము జూడ నీవు కేవలశంకరాంశసంభూతుడవని తోచుచున్నది. వానరమాత్రుడవుకావు. నాభర్త సేమముగ నున్నాడా; నామఱది లక్ష్మణుడు భ్రాతృభక్తి పరాయణుడై సుఖమైయున్నవాడా; నేను దురాత్మురాలను. దానవమాయా కల్పితమైన నామగని కంఠధ్వని వినుటతోడనే మోసపడి మాలక్ష్మణునెన్నో దుర్భాషలాడితిని. ఆతనికాయులుక మనసున లేదుకదా? వానినట్లు దురాలాపములాడిన దోషమె నన్నీగతికి దెచ్చినది. వత్సా, యీ పుణ్యమూర్తుల యుదంతము నొక్కసారి వినిపించి కర్ణరసాయనముగావింపుమా; రామకథామృతసారము వెదజల్లి నామనికిత మార్చుమా?

హను—అమ్మా! విచారింపకుము. వారుసేమముగనేయున్నవారు. నీ నాథుండు శ్రీరామచంద్రుండు,

సీ॥ జానకి కెంతొముచ్చట ♦ యంచువకుళపు
ష్పంబులగాంచి వి ♦ చారపడును
కొప్పుపై దీనిగీ ♦ల్కొలుపు సీతయటంచు
జేమంతిలతజేరి ♦ చింతపడును
ఒకనాడు మాయిద్ద ♦ రికిదల్పమిచ్చెనీ
మల్లికయని మది ♦ తల్లడిలును
మాసీతమెచ్చునీ ♦ వాసంతికనటంచు
కన్నీరుమున్నీరు ♦ గాగనేడ్చు

గీ॥ పెక్కులేల రఘూత్తముం ♦ డొక్క నిముస
మేని, హా, సీత, హా, జాన ♦ కీ యటంచు
పలువరింపక యుండని ♦ పట్టులేదు
వానిసంతాపమును భగ ♦ వంతుడెఱుగు.

లక్ష్మణుండా మహాత్ముని యూరడించుచు దనదుఃఖమును దిగమ్రింగి రాముని యసమక్షమున నొక్కసారి, హాతల్లీ, జానకీదేవీ; దురాత్ముడను. తామసగుణభూయిష్టుడను. నావలన నీకెట్టి యిడుమలు వాటిల్లినవో కాదా ; అమ్మాయని గొల్లున నేడ్చును. మాప్రభువు సుగ్రీవుడు వారలననుయించుచు ధైర్యము గొల్పుచుండును.

సీత—హనూమంత; ఇందులక్ష్మణుని యపరాధమేమియులేదు. కఠోరనారాచములవంటి దుర్భాషలాడి యాసుగుణఖనిలక్ష్మణుని మానసంబు బగల్చితి. తండ్రీ! వాయుపుత్రా; నాజీవితేశ్వరుండేమని వార్తనంపెను. నీచుడైన యీదురాత్ముని రావణుని వధించినన్నెప్పుడు కొంపోవునో చెప్పినాసంతాపాగ్నిని జల్లార్చుమా!

హను—అమ్మా; యింతవఱకు నీయునికి దెలియక నిన్నురక్షించుట జాగమ్యెసనియు నీవున్నస్థలంబెరిగిన వెంటనేవచ్చి రక్షింతు

ననియు జెప్పుమనియె. నీవంతవరకు నెట్టటులో సైరింపుము.

సీత—అక్కటా; ఇన్నిదినములనుండిగడియ నొకయుగముగ గడపుచు
నుచున్నాను.

సీ. చిడిముడిపాటుతో ♦ చెఱగు రాకాసులు
పరుషాక్షరములచే ♦ బాధపఱుప,
భల్లంబుచేదల ♦ ద్రెళ్ళనేతుమటంచు
బలలాశిభామలు ♦ భయముపెట్ట
పంక్తికంఠునిగూడ ♦ వాయనిరక్తాక్షి
భూరిధ్వనులబుగ్గ ♦ పోట్లుపొడువ
ఇక రాముడెక్కడ ♦ నీ గ్గెమాదనుజుల
చేనంచునన్నుగా ♦ సిల్లజేయ

గీ. ఈపలుగు దానవాంగన ♦ లెల్లనన్ను
ననవరతమును బాధింప ♦ బ్రాణములను
విడువగాలేక ఎట్టటో ♦ వేగుచుంటి
గడపుటెట్టులనీత్రుటి ♦ కాలయుగము."

హను—"అమ్మా! నీకు నేబిడ్డడను. నీవుసందేహింపక నేచెప్పినట్లు చేయుము.

ఉ. నాభుజపీఠి నెక్కుము తే ♦ ణంబున నష్టమువచ్చినట్టి దు
ర్లోభుల రాక్షసాధముల ♦ ద్రుంచి మహాంబుధి దాటెనిన్నుది
వ్యాభుని రామచంద్రు చర ♦ ణాబ్జములందున నుంచువాడద
ల్లీ! భయమింత బొందవవ ♦ లీలకదా తమబిడ్డకీపనుల్.

సీత—బిడ్డా; హనుమంత; అదిదుస్సాధ్యమైనకార్యము. సాహసము
వలదు.

హను—"వెఱ్ఱితల్లీ; నీవునా పరిభావమెరుంగక అట్లు పలుకుచున్నావు.

సీ. రామచంద్రుని యను ♦ గ్రహమున్న బ్రహ్మాండ
గోళముల్బట్టిగ ♦ గ్గోలుసేతు
నీలంకద్రేళ్ళతో ♦ వాలంబునన్పెల్ల

గించిమహాంభోధి ♦ ముంచువాడ
దశకంఠముఖసర్వ ♦ దనుజుల మతోర్కిప
శిఖమాడ్చి భస్మంబు ♦ సేయువాడ
క్షణములోపల సవ్రగ ♦ హామండలంబుల
మెలసియట్టిట్టుగ మార్చువాడ
గీ. తల్లి,నీవెరుగవు నాప్ర ♦ తాపవీర్య
సాహసబలంబులెల్లనీ ♦ స్వాంతమందు
సంశయింపకుమమ్మ,యీ ♦ క్షణమునందె
నీవుకోరినపనిసేతు ♦ నిక్కమమ్మ".

సీత—ఓయీ! మారుతీ; అట్టిప్రభావమునీయందుండుగాక; లేక పోవుగాక; యిప్పటినీప్రసంగము నాకమితధైర్యముగొలిపినది. సంతోషించితిగాని నన్నుభుజాస్కంధమున నెక్కించుకొని పోవునపుడు దనుజులు నిరోధించిన ప్రమాదకరముగా తలంచుచున్నాను.

హను—అమ్మా; నేను డంబముల గొట్టితినని తలంచి నావిక్రమము విషయమై సందేహించుచున్నావు. వాతాశినే రూపమును దాల్చిలంఘించితినో, ఒక్కసారిచూడుము!

(హనుమంతుడు విశ్వరూపమును దాల్చును.)

సీత—హా,హా, జగద్భయంకరము. దుర్నిరీక్ష్యము. మహానుభావ, మహాబలనందన, మహేశ్వరాంశసంభవ, నీవిశ్వరూపమును జూడజాల నుపసంహరింపుము.

(విశ్వరూపముపసంహరింప బడును.)

హను—తల్లీ; నీసందియము వదలినదా?

సీత—ఓకరువలిపట్టీ? నీవసామాన్యుడవైన శంకరాంశభవుడవు. నీవెట్టి విక్రమకార్యములనైన జేయగలవు కాని నాభర్తవచ్చి రావణుని సంహరించి నన్ను గొంపోయిననేకాని నేవచ్చుట ధర

ముకాదు. అంతియెకాక పరపురుషుల నంటరాదు. కావున నానాథుని త్వఱలోదీసికొనివచ్చి నన్ను గొంపోవుము.

హను—అమ్మా; సాధ్వీప్రవర్తన విధానమెఱింగియు నిట్లు స్నందులకు క్షమింతువుగాక. మిమ్ముదర్శించినట్లు నాకేదైన యానవాలొసంగుము.

సీత—నాయనా; ఇదే, నాచూడారత్నముగొంపోయినాభర్తకొసంగుము వేగవచ్చి రక్షింపు మనుము. (మణినిచ్చును.)

హను—(మణిని గైకొని) మహాప్రసాదము. అమ్మా; వేగరమ్మని నీవు వేఁడేచెప్పవలయునా? అవలీలగా గపిప్రవరుల గోటాన కోటుల సమకూర్చికొని రామలక్ష్మణులతోవచ్చి,

ఉ. కొండల బెల్లగించి కపి ♦ కోటులు వారిధి బూడ్చివేయను
ద్దండగతి ◆ రఘూత్తముడు ♦ దానిపయిన్బరతెంచి చండదో
ర్దండ పరాక్రమాంచితశ ♦ రప్రకరానల పంక్తిచేతనా
ఖండలవైరి రావణుని ♦ కంఠములన్వెసద్రుంచి నీదుకై
దండగ్రహించి యేలుకొను ♦ తప్పదయోధ్యకు జేర్చు నమ్ముమీ.

సీత—మంచిది. మహాసంతోషము. ఒకనెలలో వచ్చునట్లుచేయుము. అట్లురాకున్న నేనుబ్రాణముల ధరించుట దుర్లభమని నొక్కి చెప్పుము. నీవేనన్నుద్ధరించు భారము వహింపవలెను.

హను—తల్లీ; అటులేవహించితి. నాపై ననుగ్రహముంచుము. ఈబిడ్డ కాకలియగుచున్నది. ఈవనమునందలి ఫలంబుల గొన్నిటి భక్షించి పోయెద నాజ్ఞనొసంగుము. జననీ?

సీత—నాయనా; రాక్షసుల కంటబడకుండ ప్రవర్తించుము. అట్లేభక్షించుము.

హను—చిత్తము. ఇక నాకుసెలవొసంగుము. (స్వ) వ్యర్థముగ బోవ రాదు. కొందరి పీచమడచి రావణునిజేరి నేవచ్చినవార్త తెలిపి కొన్నిచీవాట్లుపెట్టి పోయెదను.

(నిష్క్రమించును.)

రంగము—అశోకవన స్థలాంతరము.

---

(హనుమంతుడు ప్రవేశించును.)

హను—ఈవనంబునందలి ఫలంబుల గడుపారమెక్కిన పిమ్మట సమూలములుగ నీచెట్లన్నియు బెఱకివైచెదను. (ఫలములదినును.) ఛీ, ఛీ, ఈఫలంబుల పేరేమో తెలియకున్నది. కానికల్లువాసన గొట్టుచున్నవి. (పాఱవైచి మఱికొన్నిటి దిని) ఇక్కడికి గొంత యాకలిదీరినది. ఇకనీవనమును పెల్లగించెదను. (పెల్లగించును)

(రాక్షసులు ప్రవేశించెదరు.)

దీర్ఘనాసుడు—వక్రదంష్ట్రా; అయ్యో, అయ్యో, ఈవనమంతయునిట్లు పెల్లగించి పాడుచేసిన వాడెవడురా.

వక్రంద—నేనెరుగను. అదుగో, కోతియొకటి కేళీకాసౌధముమీద గూరుచున్నది. అదియేకావచ్చును.

దీర్ఘ—అవును. కోతులే ఇట్టి పాడుపనులుజేయునవి. ఓసీ, కోతీ, నీవెందులకీవనమిట్లు పెల్లగించితివి.

హను—పెల్లగించవలెననియే ఇట్లుచేసితిని.

వక్ర—అటులైన నిన్నిపుడు చంపివేసెదము. రమ్ము.

హను—అట్లుచేయుటకు మీయబ్బయగన్నయబ్బకైన తరముకాదు.

దీర్ఘ—ఏమిరా; వనచరాధముని నిన్ను జంపుటకుమాయబ్బకూడ రావలయునా? (కొట్టును.)

హను—ఓరీ, నన్ను గొట్టెదవా—(వానిముక్కు బట్టుకొనును.)

దీర్ఘ—అబ్బా; చచ్చితినిరా, కోతికుంకా, వదలుము. నాముక్కు వదలుము. చూచెదవేమిరా; వక్రదంష్ట్రా! కోతిని విడిపింపరా.

వక్ర—ఓరీ; నీముక్కుపట్టుకొనిన నీప్రాణముమీదికివచ్చినది. నాకోరలు బెఱికినచో బోసినోటివాడ నగుదును. అసలేనాభార్యనన్ను ముసలివాడని యొల్లుటలేదు.

హను—రారా; వక్రదంష్ట్రా; నీభార్యనిన్నొల్లునట్లుచేసెదను.

(వానికోరల బట్టుకొనును)

వక్రదం—అయ్యో, అయ్యో, ఈకోతిగాడెంతబలవంతుడురా ఓరోరి వనపాలకులార, రాక్షసులార, రండు. కోతియొకటివచ్చివనమంతయు బాడుచేసి మేమునిరోధింప మమ్ముబాధించుచున్నది.

(మఱికొందఱు రాక్షసులు వచ్చెదరు.

కుంభోదరుడు—ఓరీ, వనచరాధమా; ఎవ్వడవురా, నీవు. వారినివదలి రమ్ము. నాతోరణమునకు—(బాణములు వదలును)

హను—ఓరీ, మగవాడ వైయ్యును ఆడుదానివలె గర్భమును ధరించిన నీతోబోరరాదు. ఆవలకు బొమ్ము.

కుంభో—ఛీ,పందా; నేనుకడుపుజేసికొనలేదు .నీవంటిమ్రుక్కడివానరుల కడుపుల జీల్చి ప్రేవులు హారముగా ధరించెదను.రమ్ము. (బాణమువదలును.)

హను—ఓరీ,కుంభోదర; నీకడుపుభారము దింపెదరమ్ము.

(చావగొట్టును. అందరితోడను పోరును.)

దీర్ఘ—ఓరబ్బో, ఇదిమాచెడ్డకోతిరా ! మనరాక్షసుల పాలిటికి కాలయమునివలె నున్నది. దీనినిబట్టిచంప మనవశముకాదు. దీనిదుంపత్రెంప, మనమందరము బెకలింపలేనివృక్షముల నిదిపెల్లగించివైచినది. అదిగో, మఱల మనమీదికి వచ్చుచున్నది. రావణబ్రహ్మతో జెప్పిదీనిని మచ్చమాపుదము. రండి. పాఱిపోవుదము—(పఱుగిడుదురు. తెరపడును.)

రంగము—అశోకవృక్షము

సీత, రాక్షసస్త్రీలు, ప్రవేశించెదరు.



సీత—మాహానుమన్న ఫలంబుల భక్షించిపోయెదనని వనమునబ్రవేశించినాడు. అదిమొదలు పెద్దధ్వనులగుచున్నవి. దానవులకే

కలు వినబడుచున్నవి. ఏమి యల్లరిజరుగుచున్నదో తెలియదు.

రక్తాక్షి—శ్వానముఖీ; లెమ్మ. లెమ్మ. వనమంతయు నేదోవింతకోతి పాడుచేసినదని మనదీర్ఘనాసుడు కేకలు పెట్టుచున్నాడు.

శ్వాన—ఆ! కోతియా, వనముపాడుచేసినదా! ఇదిగో, ఈసీతాపిశాచమునిమిత్తమేమో వచ్చియుండనోవు. ఓసీతా,మాపాలింటియమదూతా,నిజముచెప్పెదవా? ఈశూలముతోనిన్నుబొడిచిచంపనా ? ఆకోతి నీకొఱకే వచ్చినదా !

సీత—ఏమో, నేనెఱుగుదునా! రాక్షసమాయ లనేకవిధములు. అందులోనిదియొకటి. సర్పముయొక్క నిగూఢపాదములు సర్పమునకే తెలియును గాని అన్యజంతువులకు తెలియునా !

రక్తా—ఇదివట్టిమాటలతో నిజముచెప్పదే; ఎత్తుముశూలము—

(శూలమెత్తి పొడువబోవుదురు.)

త్రిజట—(ప్రవేశించి) రక్తాక్షీ,శ్వానముఖీ, శూలమునుదింపుడు. ఈమెనుబాధింపకుడు.

రక్తా—త్రిజటా, అదేమమ్మా?

త్రిజట—ఒకగడియకిందట నేనొకరాక్షస వినాశకరమైన స్వప్నమునుగంటిని. అందువలన మనలంకకు దప్పకచేటురాగలదు. ఈమెను బాధింపక ఈసీతకరుణసంపాదించితిమేని మనకుబ్రతుకుగలదు. లేకున్న మరణమే.

శ్వాన—అయ్యో, రాక్షస వినాశకరమే ? అదెట్టిస్వప్నమమ్మా ? చెప్పుము.

త్రిజ—నీలమేఘశ్యాముండైన శ్రీరాముడును, లక్ష్మణుడు, అనేకవానరసైన్యములతో కల్పప్రసూనమాలికల ధరించిదివ్యవిమానారూఢులై రక్తముద్రావుచు లంకజొచ్చి రావణాదులసంహరించి వైదేహింగొని అయోధ్యకేగుచున్నట్లును మనరారావణుండు తైలవస్త్రముల ధరించి ఖరవాహనారూఢుండై

త్తైలముద్రావుచు యామ్యదిశకేగినట్లున్న కలగంటిని. అయ్యది ప్రత్యక్షముగ జఱిగినట్లున్నది. కానికలవలెలేదు. కావునసీత నుబాధింపక యామెదయను సంపాదించుకొనుడు.

రక్తా—అమ్మా ! సీతమ్మా, మాప్రభువాజ్ఞ నెరవేర్చితిమికాని మేము నిన్నుస్వతంత్రించి బాధింపలేదు. మాపైనలుగక రంక్షించుము.

శ్వాన—తల్లీ; జానకీదేవీ! అపరాధిని. మన్నించుము.

సీత—రాక్షసాంగనలారా ! మీరాకేమియుభయము. రాజాజ్ఞానుసారి ణులైనమీదోషమేమున్నది. ఇదియంతయునాకర్మఫలము. నేననుభవించుచున్నాను. అమ్మా; త్రిజటా, నీసహాయమునునేను మఱువజాలను. విషమవిపన్మహాంభోధిలోమునుకలాడుచున్న నాకొకతెప్పకట్టవై తేల్చియూఱడి యూతనుద్ధరించుచున్నావు. భర్తృవియోగవహ్నిజ్వాలావళీ తాపంబునకు సహింపలేకప్రాణములబాయ నుద్యమము సేయుతఱి ధైర్యమునుజెప్పి రక్షించుచున్నావు. రక్కసిస్త్రీల భీకరాటోపములకు గుండెలువగిలిచావకుండవారల వారించి నాపైకరుణా కటాక్షమునబ్రోవుచున్నావు. ఇట్టిసమయమున నీవునాకు దైవతంబవు. రక్షకురాలవు. తల్లివి. అమ్మా, కులకరాళ్ళలో మాణిక్యమువలె రాక్షసకులంబు ననుగుణఖనివై యుద్భవించితివి. నీకనంతపుణ్యఫలంబులు కలుగగలవు. నీసౌజన్యతభూమిలోని యంగనామణులకాదర్శమగును. నీకీర్తి క్రవ్యాదమదాంధకారపటలమునకు బూర్ణచంద్రికవంటిది. నీకనేక వందనంబుల సేయుచున్నాను.

త్రిజ—సీతా ! నీవువిచారింపకు. నీవుసుఖించు వాసరంబులు సమీపించుచున్నవి. నీప్రాణనాథుండు నిన్నుదప్పక అచిరకాలమున రక్షింపగలడు. రాక్షసవినాశకార్యమునకు నేడేవిఘ్నేశ్వరపూజ సేయబడినట్లు వానరుడొకడులంకలో బ్రవేశించి వనమంతయు బాడుచేసి కేళీసౌధమును భగ్నముజేసి నిరోధించిన రాక్షసుల

జంపినాఁడని కేకలువిడుచు గొందఱుపోవుచున్నారు. చూచితి వా, కోతియెక్కడనైన సౌధమునుభంగపరచుట? ఇదియంతయు రావణునియమంగళకర్మఫలము. కాలముమూఁడునప్పుడుగడ్డి పోచకాలసర్పమై కఱచిచంపునందురు. దానికిదియేతార్కాణము. నేనికనిత్యకృత్యముల కేగెదను. తెల్లవారినది.

సీత—అమ్మా, త్రిజటా! పోయిరమ్ము. నీవుచెంతలేనిసమయమునాకు మరణసమయము సుమా? వేగరమ్ము. (తెరపడును.)

రంగము—అంతఃపురము

---

రావ—ఒక్కమృక్కడివానరంబీశతయోజనవిస్తీర్ణమైన జలరాశిదాటి వచ్చుటయే ఆశ్చర్యము. తరువాత మా యుద్యానవనంబంత యుబెల్లగించి ధ్వంసముజేసినదట, కేళీరత్నమందిరము భగ్నము జేసినదట, వారించిన దనుజబలంబునెల్ల రూపుమాపినదట, ఔరా; ఎంత ఆశ్చర్యము. (అనిచేయిపై కెత్తి అక్షకుమారునితలచే తిలోపడును.) అక్కటా. ఇదియెవ్వనిమస్తకము, (చూచి) హా కుమారా, అక్షుడా! నీకెంతదుర్గతి కలిగినదిరా; నాయగ్రపుత్రునెవ్వఁడు చంపియుండును. ఈవానరమే వీనితలద్రెంచినదనిత లంతునన్న నాకాశ్చర్యముగనున్నది.

చం. అనుపమసత్వశాలియమ ♦ రావళినెల్లతృణంబులోదెఱ
ల్చినఘనవిక్రమైకనిధి ♦ జ్యేష్ఠకుమారుఁడు నాకునక్షపు
త్రునినొకస్వల్పవానరము ♦ ద్రుంచెననంగను వింతయయ్యెహా
ఘనతరశోకవహ్నిశిఖ ♦ గ్రాగుచునుంటి నికేమిసేయుదున్.

ఈయుత్తమాంగము ఖడ్గహతిచే ద్రుంచినట్లగుపడక మెలిబెట్టి త్రెంచి వైచినాహస్తాంజలి విసరిబడి నట్లుతోచుచున్నది. ఔరా, కాల మెంతవక్రతమంబుగ మాఱిపోయినది. ఈవధావిధానముజూడ నానరకృత్యమువలెనే తోచుచున్నది. హా, అక్షకుమారా!

చం. దనుజకులాబ్ధిచంద్రునివి ♦ ధంబునదొల్తజనించినావు నీ
జనకునినాయనంతరము ♦ సర్వనిశాకరరాజ్యలక్ష్మి జే
కొనుటకుగర్తవీవనుచు ♦ కోరికతోముదమందునాదుకు
క్షినిదవవహ్నిదాపిమృతి ♦ జెందితెయక్షకుమారకోతిచే.

శివశివా కుష్ఠా, నీకెట్టి దుర్మరణము సంప్రాప్తమైనదిరా.
(కోపముతో) ఓరోరీ, వనచరాధమా !

ఉ. రావణనామమున్ శ్రవణ ♦ రంధ్రములన్ బడినంతలోసనా
దేవగణంబులేభయగ ♦ తిన్దెసలంటుచు జాఱిపోవనో
రీ ; వెఱపింతలేకయెమ ♦ దీయసుతున్ బొలియింపలోకవి
ద్రావణతీవ్రకోపశిఖి ♦ దగ్ధముజెందకరిత్తపోదువే.

ఓరీ, మాఇంద్రజిత్తునిటకు తోడుకొనిరమ్ము. పొమ్ము.

ప్రతీహారి—చిత్తము—(నిష్క్రమించియింద్రజిత్తుతో ప్రవేశించును.)

ఇంద్ర—తండ్రీ ; సర్వమును వినియుంటిని. తొలుతనే నేనేగినమా
యన్నకిట్టి దుర్మరణము ప్రాప్తింపకయే యుండును. ఇంతకును
దైవగతి ఇట్లున్నది.

గీ. కేవలతృణంబుగిరిని బ ♦ గిల్చినటుల
కోతియొక్కడు మాయన్న ♦ గూల్చెననుట
వింతయయ్యెను నేదాని ♦ నంతమొంద
జేసివచ్చెదమీకింత ♦ జింతవలదు.

రావ—వత్సా ! మేఘనాద, నీవావానరంబు నశ్రమమునవధించెదవ
నియెఱుంగుదును. కాని జ్యేష్ఠకుమారునకట్టి దుస్థితిగలిగినం
దులకై విచారమునన్ను దహింపకపోదు. నాహృదయముబీ
టవారుచున్నది. కొందలముసెసుచున్నది. కారణమేమో తెలియకు
న్నది. నీవుతక్షణమపోయి యామర్కటమును గట్టినాచెంతకు
దోడుకొనిరమ్ము. పొమ్ము. వానియుదంతమరయవలెను.

ఇంద్ర—చిత్తము ; లేచేసెదను. (తెరపడును.)

రంగము—అశోకవనము—హనుమంతుని ప్రవేశము.

హను—ఇప్పటికి రావణునిగర్వకుటీరమునకు బుత్రశోకాగ్ని నిదాక్రొల్చితి. ఇప్పట్టున నాతను పేకుసేయుటకు, తానో మతికొందరి యోధులనో పంపవచ్చును. అదుగో;

(ఇంద్రజిత్తు ప్రవేశించును.)

ఇంద్రి—ఓరీ, వనచరాధమా : ఎవ్వడవీవు?

హను—నీవెవ్వడవు?

ఇంద్రి—ఏమిరా, పొగరు. మాలంకకు దొంగతనమునవచ్చిన నీకింత మొండిధైర్యమేమిరా?

హను—దొంగతనమునవచ్చుటకు దెచ్చుటకు నేను ఘోరపాపుడనైనరావణుడను కాను. వియచ్చరలందఱు జూచుచుండ వియన్మార్గమునవచ్చితిని. అంతియెకాక అమంగళకార్యముల నొనర్చువారికధైర్యముకాని మంగళకార్యరతిని సంచరించునాకుధైర్యముకాకనీకా;

ఇంద్రి—వచ్చినవాడ వూరక పోవక వనభ్రంశముసేయనేల? వారించినదానవులహతమార్చనేల? సౌధమును గూల్పనేల?

హను—దుష్టులైన వారలబరిమార్చుటయు నమంగళకార్యములకాలవాలములైన వనముల భవనముల భగ్నముసేయుటయేనా సహజగుణము.

ఇంద్రి—నీవెవరిచే నంపబడినావు? నీనామమెయ్యది? ఎందుండువాడవు.

హను—అవన్నియునడుగుటకు నీవెవ్వడవో తొలుత జెప్పుము. నీవునాయుదంతము వినుటకు దగవు.

ఇంద్రి—ఓరీ దుష్టవానరుడా: ఏమిరా, అధిక్షేపించుచున్నావు?

ఉ॥ దోర్జవమొప్పగా బ్రిళయ ♦ ధూర్జటి లోకము లేర్చునట్లుగా
నిర్జనపాళివో కడచి ♦ నిస్తులస్వర్గ రమాధిపత్యమున్
అర్జనజేసి కీర్తినిది ♦ గంతములందున నిల్చినట్టియు

త్యూర్జిత సత్యశాలినిర • ణోర్విసజేయు డనింద్రజిత్తుడన్

హను—ఇప్పుడునీకదియే ముప్పువాటిల్ల జేయగలదు. ఏమందువా, ఇంద్రవిజేతనని మదాంధుడవై యనేకదుష్కార్యములనొన రించి యాసత్వమును క్షీణింప జేసికొనిన మహాపాపులు మీరు. మిమ్మికవిజయలక్ష్మి బొందనేరదు. మిమ్ములనందఱ వధించి లోకమున బ్రశాంతిని బ్రతిష్ఠజేయుటకు వచ్చినమహాపురుషుని భటుడనునేను. మీవిక్రమంబంతయు మహాపతివ్రతల కన్నీటి వెల్లువలచే జల్లారిపోయినది. ఇకమీరందరును మృత్యుణ పాత్రులైరి.

ఇంద్ర— మూర్ఖా; ఏమిరా, ప్రేలెదవు? ఇదిగో; నాబాణాగ్నికి శలభప్రాయుడవై మ్రగ్గుదువుగాక. రమ్ము. రణమునకు.

హను—నీవో, నేనో, శలభంబనగుట, మీయన్నయైనఅక్షకుమారునడిగి తెలిసి కొనిరమ్ము. యమలోకమునకేగి—

ఇంద్ర—ఇదిగోచచ్చితివిరా. (బాణములవదలును)

హను—నీచప్పిడి కోలలకునేభీతిల్లువాడను గాను.

ఇంద్ర—అటులైన నిన్నిపుడే బ్రహ్మాస్త్ర నిబద్ధునిజేసి మాతండ్రిచెంతకు గొంపోవుదును.

హను—(స్వ) వీడుప్రయోగించు బ్రహ్మాస్త్రమునన్ను బంధించును కానివధింప జాలదు. అయినను రావణునితో గొంచెము ప్రసంగింపవలసియున్నది. కనుక బ్రహ్మాశరబద్ధుడనై వానిజేరి కొన్ని నీతులజెప్పి పోయెదనుగాక (ప్ర) ఓరీ. రావణపుత్రా! అటులే బ్రహ్మాస్త్రప్రయోగము సేయుము.

ఇంద్ర—ఇదిగోప్రయోగించుచున్నాను. (ప్రయోగించును)

భటులారా ఈబ్రహ్మాస్త్రముచే నీవానరుడు బంధింపడినాడు. మిమ్మేమియు జేయలేడు. వీనిని నిర్భయముగా గొనిరండు.

భటులు—చిత్తము (హనుమంతుని జుట్టుముట్టుదురు)

హను—మేఘనాదా, నేనుమీతండ్రితో గొంతబ్రిసంగింప వలసియి ట్లునీబ్రహ్మాస్త్రమునకు బద్ధుడనైతినిగానినిన్నిప్పుడునాతోకతో జుట్టినేలబెట్టిగొట్టిమ్రందింపనేరక కాదుసుమీ? గర్వింపబోకుము.

ఇంద్ర—నీప్రతాపముల కెవ్వడును జడియడు. రమ్ము. మాతండ్రిగారి పదముల బడవైచెదను.

(అందరునిష్క్రమించెదరు)

రంగము—సభ

రావణశంబరులు ప్రవేశించెదరు



రావణు—శంబరా, అమాత్యశేఖరా,

ఉ— మూడుజగంబులన్ సమర ♦ భూమినిగెల్చిజయంబుగొంటినా
కీడగురేడు లేడనియు ♦ హీనముదంబును జెందుచుంటినా
పాడుప్లవంగ మేకరణి ♦ వచ్చెనొలంకకు బుష్పవాటికన్
మేడల బాడుజేసెరణ ♦ మేదినిబెక్కుఱ జంపెనుక్కునన్.

శంబ— ప్రభూత్తమా: ఏనిర్జరుడో వానరాకృతి దాల్చివచ్చి తనపగ నీవిధంబున దీర్చికొన నెంచియిట్లు చేసియున్నాడని తలంచెదను. ఇంతకును మీ కుమారుడింద్రజిత్తు వానివధించుటకు బోయి యున్నాడుకదా; ఇంతలో నేవచ్చుచుండును.

(ఇంద్రజిత్తు హనుమంతునితో బ్రవేశించును)

ఇంద్ర—తండ్రీ; ఇదిగో, ఈదుష్ట వానరమును బంధించిదోడి తెచ్చితిని. తగినట్లు శిక్షింపుడు.

(విభీషణుడు ప్రవేశించును)

విభీష—మేఘనాదా; ఈకోతియే నావనభంగము గావించినది?

ఇంద్ర—ఔను.

రావ——ఓరీ, మర్కటాధమా; (కత్తిదూసి)

మ॥ అరరే తుచ్ఛమృగంబ యెవ్వడవు లో • కాలోకదుర్జ్ఞేయభీ
కరదోర్విక్రమశాలినాదయినలం • కంజొచ్చిమాద్దైత్యులకా
బారిగొన్నాడవు పుష్పకాననమును • న్మూలించితే, దుష్టవా
నరమా; కావరమా, స్వయంకృతమదో • న్మాదభ్రమా, తెల్పుమా;

హను——(స్వ) ఈదుష్టరాక్షసుడున్నత సింహాసనాసీనుండై ప్రశ్నించు టయునేను క్రిందనిలచి ప్రత్యుత్తర మిచ్చుటయునా ! వీనివీర మునుమించిన వాలసింహాసనమును గల్పించి కొనితరువాత ప్రత్యుత్తరంబొసంగెదను. (వాలముబెంచిపీఠిక నమర్చికొని) రావణా: ఏమంటివి? నీకిదే ప్రత్యుత్తరమిచ్చుచున్నాను. వినుము. నీపాలిటికి గాలయముడైన వాలినొక్క కోలదూలించిన మహానుభావుడొకడు కలడు. అతనికిభటుండయిన వానికిభటుడను. నేనంజనాతనయుండను. వాయుదేవప్రసాదసంజనితుడను. నాపేరుహనుమంతుడందురు.

రావ——ఓరీ, నీ వెందులకై మాలంక జేరితివి;

హను——మాప్రభువైన శ్రీరామమూర్తి యాజ్ఞచే వానరనాథుండైనసుగ్రీవుడు పంపసీతాన్వేషణార్థ మీవారాసిలంఘించివచ్చితిని.

విభీష——వచ్చిన వాడవుచూచి పోవక ఇందలియుద్యానవన మణిహార్మ్యముల భగ్నముసేయనేల?

హను——ఆవనంబును అమంగళకార్యపరతంత్రుడైన రావణునిచేన పవిత్రముగ జేయబడుటచే వాటినిధ్వంసము సేసితిని. అడ్డువచ్చిన వారినిసంహరించితిని. మఱియువచ్చినవాడను రావణుతో బ్రసంగింపక యూరకపోవరాదని ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రమునకు గట్టువడియిటు వచ్చితిని.

రావ——ఓరీ; మర్కటాధమా నాతో నేమిప్రస్తాపింపదలచితివిరా?

హను—వినరా; రావణా; చెప్పెదను.

ఇంద్ర—దురాత్మా,దానవ సార్వభౌముని, ,,ఓరీ యని,, సంబోధించెద వా? చక్రవర్తులతో ప్రసంగించు మర్యాదనీకు దెలియదు కాబోలు, నీకో ఆడానే వీపుబ్రద్దలు గొట్టినేను చెప్పుదునా?

హను—అట్లుసేయనీకుగాదే, నీతండ్రికిని నీతాతకును గూడవశము కాదు. నీవావలనుండుము.

విభీష—వత్సా: నోరికివచ్చిన నట్లుప్రేలు వీనితోనేల? కర్తవ్యము నుజెప్పనిమ్ము.

హను—శ్రీరామమూర్తి యాజ్ఞచే మాప్రభువైన సుగ్రీవుండునీతో జెప్పుమనిన మాటలవినుము.

ఉ॥ శ్వానము సింహభోజ్యమగు ♦ వస్తువుదొంగిలినట్లురామభూ
జానిమృగార్థమేగ రభ ♦ సంబున దస్కరవృత్తి బూనియా
జానకిదేవి దెచ్చుట గృ ♦ శానునిభీకర కీలలంటినవ్
ప్రాణముగోలుపోవుట యె ♦ పాపపురావణ, యంచుబల్కెడిన్.

నీవుపరమ తపోనిధియైన పులస్త్యునిపౌత్రుడవు. సత్వగుణాలంకారుడైన విశ్రవసుబ్రహ్మపుత్రుడవు. వీరమహాతపము జేసిపితామహుమెప్పించియమోఘ వరంబులు గొన్నవాడవు. నీవంటియున్నత ప్రభావుండిట్టి యమంగళకార్యము లాచరించుట వంశనాశనము కాగలదు. ప్రమాదము ధీమంతులకు గలుగుట సహజము. ఇప్పుడైనను వైదేహిని గొనివచ్చి శ్రీరామచంద్రుని పాదములకు సమర్పించి ,,త్రాహిమాం" అనిశరణంటివేని నిన్నామహానుభావుడురక్షింపగలడు. ఆతడుఆశ్రితవత్సలుండు. సర్వలోక సంస్తవనీయుడు. శ్రీరామచంద్రుండు నరుడని తలంపరాదు దుష్టశిక్షణమును జేసిధర్మమును బ్రతిష్ఠింపనవతరించిన నారాయణునిగా దలంపుము. బుద్ధితెచ్చుకొనుము. వేగవచ్చిశరణు బొందుము. అనివచించెను.

రావ—ఓరీ; దురాత్మా; ఆ వానరాధముఁడు సుగ్రీవుఁడు నాకుహితవు దెల్పు వాఁడుగా; ఛీ, నోరు మూయుము.

శా॥ ఆసుగ్రీవుఁడు రాముఁడున్ దగుదున ♦ మ్మాయంచు వహ్వారెనా
కాసందేశము సీతులన్పు వా ♦ రాహా భయంబయ్యెగా
ఛీ, సిగ్గింతయులేదె వానరయరపుల్ ♦ చెప్పంగ నీకిందును
ల్లాసంబొప్ప మనుష్యవానరులఁ ♦ లన్ మిత్రిగెద జూఁడుమీ

హను—అది వేరుమాట, ఎవరికిసామర్థ్యమున్న వారేమిత్రింగుదురు.

ఇంద్రి—అదేమిరా, మూర్ఖా, అధిక్షేపించుచున్నావు. నీవు నాతండ్రి పరాక్రమమెఱుంగక పలుకుచున్నావు సుమా?

సీ॥ కలధౌత గిరినీశు ♦ గణముతో పెకలించి
మూల్గిపై నిడుకొన్న ♦ మహితబలుఁడు

హను॥ దానిక్రిందను జిక్కి ప్రా ♦ ణావశిష్టుఁడై
ఏడ్చివెండ్డి త్రిట్టి ♦ హీనగుణుఁడు

ఇంద్ర॥ దివ్యులందఱి గెల్చి ♦ దేవలోకముగొని
మానుజగన్నులేలు ♦ తేడితండు

హను॥ బల్మిబట్టగ వేద ♦ నతిత్రోయగా గూల
బడిదుఃఖమందిన ♦ చెడుగువీఁడు

ఇంద్ర—శీఘ్రాళి హోమంబు ♦ జేసి విధాతచే
భూరివరాల్గొన్న ♦ పుణ్యుఁడితఁడు

హను—పరమ సాధ్వుల ♦ బల్మిజెఱచి నిష్ఠజుడై
బయిసి మాలి నయట్టి ♦ పాపివీఁడు

ఇంద్రి—దిగ్విజయము జేసి ♦ స్థిరకీర్తి రమవెల్గు
బ్రహ్మాండభాండస ♦ మాత్రిట్టితండు

హను—తెలిదివి స్త్రీలసాణుల ♦ బిండిమై చేతి
గొట్టికి నచ్చిన దొంగ ♦ కుక్కవీఁడు

ఇంద్ర—గీ. నిత్యదివ్యాంగనాకర • నీరజాత
భవ్యసుఖమందు దానవ • బ్రిభువితండు
హను—కార్తవీర్యార్జునుని • బంధిఖానదగిలి
వత్సరసహస్రి మేడ్చిన • వాడెవీడు.

రావణ—ఓరోరీ! ప్రమత్తకీశాధమా; చచ్చితివిరా. (కత్తిదూయును.)

విభీష—అన్నయ్యా! శాంతింపుము. ఈదూతయొక్క యుపన్యాసమంతయు వినుట మనకుపయోగము కావున నాగ్రహింపక వాడు చెప్పదలచినది చెప్పనిండు.

హను—ఇదిగో జెప్పెదనాలకించుడు. రాముడన నెవ్వడో మీకు తెలియ వలసియున్నది. దశకంఠా?

చం. అని నినుచిట్టికట్టితవ • యగ్నికుతొట్టెకు గందుకంబుగా
నునిచిన కార్తవీర్యునిమ • హోన్నత బాహుసహస్రకాననం
బును దునుమాడినట్టి భృగు • పుత్రుని రాముని విక్రమాగ్నినా
ర్చిన ప్రబల ప్రభావరణ • సింహుడు రాముడు సుమ్మిరావణా.

అంతియెకాక నిన్నుమించిన ఖరదూషణాది దానవుల తీవ్రతర బాణాగ్ని హేత్రమున రెప్పపాటులో భస్మీపటలము జేసిన పరాక్రమనిధి. అట్టిమహోహవమృగేంద్రంబైన శ్రీరామున కపకారమాచరించుట నీలంకకు నీవుచిచ్చు పెట్టుకొనుట కానివేఱు కాదు. కావున,

సీ॥ ప్రళయ కాలాగ్నులు • ప్రజ్వలించినరీతి
రామునికోపాగ్ని • రగులకుండ
విలయాబ్జ గర్జాధ్వ • నుల మాడ్కికపులుగ
ర్జిల్లి పెల్లున హుంక • రింపకుండ
బవరంబు కగ్గెనిప్పటి • కంచుసౌమిత్రి
చిత్తంబునను సంత • సింపకుండ

తిండియిప్పటికి బ్రాప్తిం ♦ చె రాయనిపక్షి
భూతాది సంఘముల్ ♦ పొంగకుండ

గీ॥ కీశపతులద్రులనుబెల్ల ♦ గింపకుండ
భూరివారాశిగిరులచే ♦ బూడ్చకుండ
చెలగినీలంక ధ్వంసంబు ♦ సేయకుండ
శరణుబొందుము శ్రీరామ ♦ చంద్రుజేరి.

ఒకవేళ మదాంధుండవై నీవట్లుసేయకయు పేక్షించితివేని,

ఉ॥ వానరకోటు లెల్లగిరి ♦ వర్గమునుం బెకలించి తెచ్చియం
భోనిధి బూడ్చివేయగపి ♦ ముఖ్యులు కొల్వగ వచ్చిరామభూ
జాని లయాంతకాకృతిని ♦ శాతశిలీముఖముల్చి గుడ్చిమీ
దానవులన్ వధించినిను ♦ దగ్ధముసేయును జుమ్మిరావణా.

రావ—ఓరోరి! వానరాధమా, నోరికివచ్చినట్లు వదరుచున్న నిన్నిదే వధించెదను.

విభీష—అన్నయ్యా! తాళుము. ఓరీ, వనచరా; నీవు చెప్పదలచిన దింతయు బూర్తియైనదా; ఏమైన దరువాయి యున్నదా?

హను—ఇంకను చెప్పవలసియున్నది?

విభీష—అటులైన జెప్పుము. తారతమ్యము నెఱిగి సంభాషించుము?

హను—ఓరోరి, పంక్తికంఠా,

రావ—ఛీ, నోరుమూయుమిదే చచ్చితివి—(మీదికేగును)

విభీ—అన్నయ్యా! యుక్తాయుక్తము నెఱుంగక శాత్రువుల సందేశంబు దెచ్చిన దూతలునోరికి వచ్చినట్లు వదఱుట సహజము. అయ్యది ప్రేషకుల యభిప్రాయముకాని దూతలయుద్దేశము కాదు. నీవువీని సంభాషణమున కలిగి చంపుట ధర్మముకాదు. సువిచారశూన్యుడై ప్రవర్తించిన దూతకేదో యవయవమునకు వైకల్యము కలుగజేసి పంపుటుచితము. అందులో నితడు వాన

రుడగుటచే వీనికి ముఖ్యాంగము వాలము. దానిని ఖండించియోలే నగ్నిచే దహించియో పంపుట ధర్మము. అంతియేకాని చంపిన మనవార్త శత్రువుల కెట్లు తెలియగలదు. వారువచ్చుటెట్లు? వారిని మనము వధించుటెట్లు?

రావ—తమ్ముడా! నీమాట యథార్థము. రాక్షస భటులారా; వీనితోకకు గట్టిగ తైలవస్త్రముల జుట్టి యగ్నిచే దగులబెట్టుడు. వీనికిదియే తగిన పరాభవము.

భటులు—మహాప్రభూ; మమ్ము జావగొట్టునేమో కదా?

ఇంద్రి—భయములేదు. మాసమకునునే వీనికట్టి శిక్షగావింపుడు.

[వానరుని తోకకు భటులు తైలవస్త్రముల జుట్టిఅంటింతురు.]

హను—[స్వ] అగ్నిభట్టారకుడును నన్నుగన్న తండ్రియైన వాయుదేవుని వలన జననమందిన వాడేకదా! నన్నేల దహించును. అంతియే కాక శ్రీరామకార్యార్థమై వచ్చిన నాకేయాపదలును రావు. ఇది మిషచేసికొని ఈలంకాపుర సౌధముల నన్నిటిని ముట్టించి హుతాశనున కాహుతిజేసెదను.—(చేతులు జోడించి)

ఉ. ఓహుతభుక్సహోదరమ ♦ హోజ్వల కీలికరాళ నీకునే
నాహుతి సేయువాడనక ♦ లాసురకాంచన రత్నభాసురత్
గేహ వితానముల్ బ్రబల ♦ కీలలచే దహియింపుమయ్య దు
ర్మోహుల సర్వరాక్షసుల ♦ దగ్ధంగజేయుము నీకుమ్రొక్కెదన్.

[ప్రకాశము] జై, శ్రీరామచంద్రా! జై, [నిష్క్రమించెదరు.]

[తెరపడును.]

రంగము—లంకాదహనము.

హను—[ప్రవేశించి] ఇక్కడకే లంకాపురమంతయు బూర్తిగాదగుల బెట్టితిని. రాక్షసుల యార్తధ్వనులతో బాటుపెనుమంట లాకసమున నంటుచున్నవి. నావార్త వినిమా తల్లిజానకీదేవి

విచారమందకుండ నావాలాగ్నిమంటలను సముద్రోదకములచే జల్లార్చికొని యామెను దర్శించి మాతల్లిమనసు జల్లచేసి తత్క్షణమే జలరాశిని దాటి మాతండ్రి శ్రీరామచంద్రులకీ మేలుమాట వినిపించెదను.

(నిష్క్రమించును.)

---

రంగము—అశోకవనము.



సీత—అన్నన్నా! అదృష్టవిహీనుల నాదరింపవచ్చిన వారికి సైతము ఆపదలలముచున్నవి కదా! దైవమా, ఇకేదిదిక్కు. మాహనుమన్నతోకకు ప్రైదెలవస్త్రముల జుట్టి యగ్గిముట్టించినారని వినినది మొదలు నాయంతరంగము సంక్షోభించుచున్నది. అంతటనీ లంకాపురమంతయు నొక్కసారి తగులువడు చున్నట్లుమంట లుప్పరమ్మున కెగయుచున్నవి. ఈదహన కృత్యము మాఆంజనేయుఁడే చేయుచున్నట్లు తోచెడిని కాని ఈప్రళయకాలాభీల వహ్నిచ్ఛటల మధ్యనాబిడ్డఁడు హనుమంతుడేమయ్యెనోవార్త తెలియకున్నది. స్వామీ! అగ్నిభట్టారక,

ఉ. నీవును నాంజనేయుఁడును ♦ నిక్కముగా నలవాయుపుత్రులే
కావునవాలమందు మణి ♦ కైవడి జల్లగనుండుమయ్యనీ
వేవిధమైన వేడి నెన ♦ యించియలంచకుమయ్య తమ్మునిన్
గావగదయ్య నిర్జరము ♦ ఖా, ఇదెనీకు నమస్కరించెదన్.

[తెరలో అగ్నిహోత్రుడు]

ఓసాధ్వీమణీ; వైదేహీ, శ్రీరామచంద్రుని దూతకునావలనపాయము సంభవింపదు. భీతిల్లకుము. హనుమంతుఁడు సేమముగనున్నాఁడు. నిన్నుదర్శింపవచ్చుచున్నాఁడు?

సీత—హుతాశనునకు నమస్కారశతంబులు.

[హనుమంతుఁడు ప్రవేశించును.]

హను—తల్లీ! నమస్కారము. నేను సురక్షితముగ నున్నాను? నాకొఱకై తపింపవలదు. వాలాగ్నిచే లంకాపురమంతయు భస్మీపటలముఁగావించితి. రావణునకనేకదుర్భాషలచేనొప్పించితిని. నాకనుజ్ఞ నొసంగుము. పోయివచ్చెదను.

సీత—నాయనా, హనుమన్నా; నీపరాక్రమము లోకాతీతము. నీయాగ్రహమునందలిభాగమును దీర్చికొంటివి. ఇంకనీయభిమతమేమి?

హను—అమ్మా! శ్రీరామునియనుగ్రహము నన్ను సర్వదా కాపాడుచుండుటయే నాకోరిక. అయినను ఇట్లు జఱుగవలసియున్నది.

ఉ. రాముఁడు పంక్తికంఠునిశి ♦ రంబులద్రుంచెడుఁగాక వానర
స్తోమముతోడ మిమ్ముఁలన ♦ యోధ్యకు దోడ్కొనిపోవుగాక ఈ
భూమి నిరాతుసంబయి ప్ర ♦ పూర్ణఫలంబులమించుగాక స
ర్వామరు లుర్విభారముదొ ♦ లంగుటచే ముదమందు గావుతన్.

సీత—తథా, అస్తు! తథా, అస్తు. [తెరపడును.]

గద్య. ఇది శ్రీ కాశ్యపసగోత్ర చక్రావధాని వంశపయోధిచంద్ర
నారసింహార్యతనూభవ నరసమాంబాగర్భశుక్తిముక్తా
ఫల వెంకటసుబ్బరాయగురుకరుణాలబ్ధసాహిత్య
నానానాటకరచనాధురీణ శ్రీమాణిక్య
శర్మ విరచితంబైన లంకాదహన
నాటకము నందు పంచ
మాంకము
సంపూర్ణము.
శ్రీ శ్రీ శ్రీ



# ఈ నాకములోని సాంగ్సు.

1. పాట—శూర్పనఖ—మోహన—రూపకము

శూర్ప—కామినీమనోహరా, నా, కాంక్షదీర్చిమనుపరా ||కామినీ||

వేమరునిను వేడితిరా, రామ భువనమోహనా ||కామినీ||

చ. నినుగనినప్పటినుండియు, మనసిజు డసమాశుగముల

వరిణమొనరించెను నామది, క్షణమునిలువ జాలగదర ||కామినీ||

2. తీవ్రమగు విరాళిచేత, దేహము తపతపత యుమనుచు

తరుచగు పులకలచే గా, కరకాయవిధానదోచె ||కామినీ||

3. దివిజవరుల మించినట్టి, తేజముకల్గినరాఘవ

నవతులనీదళశ్యామ నను, కౌగిటజేర్పగదర ||కామినీ||

2. పాట—శూర్ప—అఠాణా—రూపకము.

శూర్ప—బేలనైతిరా, విరాళికోర్వ జాలనురా ||బేలనైతిరా||

నీయుదారరాగాబ్ధిన, నోలలాడజేయరా ||బేలనై ||

2 మారుబారికోర్వలేక, మతిభ్రమించియున్నదాన

సారసాక్ష రామచంద్ర, సరగనన్ను నేలగదర ||బేలనై ||

3 విరహానలకీలల నను, మరణింపగ జేసినట్టి

దురితుడవ గుసకుప్రతము, తోజనియేలర కాల్పనా ||బేలనై ||

4 నీపదముల బదుదానా, నీచరితంబునతాణా, రాగము

తో బాడుమనా, రాగము దీర్చుము రామా ||బేలనై ||

3 పాట—సీత—కళ్యాణి—ఛాపు.

సీ|| క్రూరారాక్షసా | పోరా | ఈకాఋకేల ||క్రూరా||

ఒంటినుంటినని | గొంటులాడెదవా | మంటిపాలౌదువు

మారాడకికపోరా "క్రూరాక్షసాపోరా"

2 నానాథుడిదివిన్న | ప్రాణాలహరియించు | దానవకుల

మంతా | దగ్ధంబుగా సేయు ||క్రూరారాక్షస||

3 పరనారులను బట్టు । పాపంబునీకులము । రూపంబులె
కాని । ర్మూలించురా మూఢా ॥క్రూరారాక్షస॥

4 పాట—రాముడు—నాదనామక్రియ—త్రిపుట

రాము॥ జానకీఎందూ పోతీవోనా ॥ పాృణమెట్లుభరించూవాడ ॥జాన॥
1 చానవిన్ను బాయగనాకీ । జగమెయంధకారంబయ్యేను ।
మానినినాకగుపడవా యొకమారుకోపమా నాపాపఫలంబ ।
2 అసురులచే జిక్కితో పులులే । మెసవినవోనిను నీయడవిని ।
కుసుమకోమలీ నామదిగనుగొనగ బూవుపొదలను డాగితి
వేమొ ॥జానకీ॥
3 భానుకూన్య మగుదినముంబలె । పర్ణశాలచీకటి గ్రమ్మెను ।
మానవతీమణి నీవెటుమటు । మాయమైతివోనా కెయ్యా
దితోవ ॥జానకీ॥

5 పాట—రాముడు—భైరవి—ఆది.

రాము॥ రామమయజీవితా। సీతా। రమ్యమగుణోత్తమచరితా,
రామునివిడువగదగునె ॥రామమయ॥
2 క్షణముమిమ్ముబాయజాలనాథా, యనినావెను వెం।
టనె బడిచచ్చియు, మటుమాయంబై పోతివీవియోగ।
మెటుసైరించితో. ఏమైపోతివా ॥రామమయ॥
3. అమరారులపాలై తివో మృగములె, హతమొనరించెనో।
అగుపడవై తివి। బృతుకజాలనిను। బాసిక్షణంబును।
రామరోనీదర్శనమునొసంగవె ॥రామమయ॥

6. పాట—రాముడు—

రాము॥ ఔరా। రావణా। నేనులేనితరినినాదు నెలతను మృచ్చిలి
పోతివిగా, రావణా। ఛీ! రావణా॥

2. రామునికోపజ్వాలలు। రగిలినిన్ను నీకులంబు। దగ్ధము
గనుసేయునెందు। దాగినవిడువకసమ్మమురా ॥రావణ॥

3. నీచేసెడు దుష్కృతులను జూచి యూరకున్నద్విజుల।
వీచమడచిలోకములను, రాచిరంపమున గోసెదరా ॥రావణా॥

4. నా సతియేలేనప్పుడు। నాకుజగముతోబనేల। ఇపు
డకాలనిలయముగా। వించువాడద్రుంచువాడ ఛీ! రావణా॥

7 పాట హనుమంతుడు—కాంభోజి—రూపకము

హను—దర్శించితినినాదు। దైవంబు సేవ్యంబు। ధన్యతను గాంచినా
నహాహా। నేనిపుడు ॥ ధన్యతనుగాంచినా నహాహా ॥ దర్శించి॥

2 రవివంశ మణిదీపు। నవనీల రుచిరూపు। స్తవనీయ చరితు।
నే డహాహా! త్రైలోక్య, స్తవనీయచరితు ॥ ॥దర్శించి॥

3 ముల్లోకములనేలు। వల్లభుని శ్రీరాము। పదపద్మములగొల్తు నహా
హా! సంతతము। పదపద్మముల గొల్తు నహాహా। ॥దర్శించి॥

8 పాట హనుమంతునకు లంఖిణికి దైలాగు

హను—ఓసి, లంఖినీ నాతోడా! పంకమటే నీదూ, పొంకామూర్చెద
పారి పోకానిలువుమా లంఖిణీ.

లంఖి—వానరా చచ్చేవు వాదులాడకపోరా, నీయబ్బాతారమానే
నిలువానీలంకాలో॥ వానరా! ఓరీ।వానరా।కుంకా

హను—నాయబ్బాతలసానీ యూయువుసెల్లునే, ఈదెబ్బతిని గూలారా
వే రాకాసీ, లంఖిణీ॥

లంఖి—చచ్చితి రానీదూ మచ్చామానీపోను నీకెంతబలముండెరా
కోతి, కుంకా॥

9 పాట—హనుమంతుడు—ముఖారి—అట

హను—ఎంతా వెతకినగాని, కనుపడదేసీతా। ఏమందూ నానొసటి
వ్రాతా॥ అంతఃపురంబుల।హర్మ్యస్థలంబుల గాలించి శోధిం
చి కానలేకాపోతి॥ ఎంతా॥

2 ఏతావునునిల్పి ఎట్టిబాధలగొల్పి ఎంతశోకింపజేసిరో లేక వ్యతిరే
కినియటంచును సోకుమూకలు చంపిమెక్కిరో కాకరధమున
నుండి యురికెనో, కడలిలోప్రాణములు బాసెనో॥

3 రామా,నీదేవిని రాక్షసపురిగసకా, శోకించుచుంటినర్గా
జూడవాదయనూ
నీమహా దరమింత చూపమి, భూమిపుత్రికజూడనేర్తునె
స్వామి నీకరుణారసమువెద, జల్లిభక్తుసముద్ధరింపవె ॥ఎంత॥

10 పాట—రావణుడు—సురట—ఆది

రా—ఎందులకీకు ందు, మందయానరోరాము
నందాసలికమానరాదే మోదమందికౌగలీయరాదే ॥ఎంత॥
ఎల్లలోకములాకు, నీశ్వరివౌదువు
ఒల్లావెనన్నీవు బాలామణీ,చెల్లునే నీకునీచెలువంబువాపోయి,
పొల్లూసేయనేల పొలతీనన్నేలావె ॥ఎందుఃకీ

2 నూహూడ ల్లదె వువ్వు, మార్గిణమ్ములనేసె
యోరువగాజాలజేరారావె, బ్రాసైనని బాహు
పంజరమున డాచి ప్రాణంబురక్షింపరావే,రాణీ ॥ఎందులకీ।

11 పాట—సీత.

సీత॥ ఓరోరిరావణా। కామమదాంధత। నీగతినన్నిటు లేచజెల్లునా।
న్యాయమా॥ ఓరోరి॥

2 పరసతులను బల్మిచెఱనుబట్టుట। పాపమటంచును మ
దినెరుగవోకో। శిరములు బదియును నురుమగుజుమినా।
దరికిగాకుదగ్ధము జెందెద ॥ఓరోరి ॥

3 నరసిజసంభవు వంశమందునను । జన్మగాంచి బ్రహ్మణ్యుడవై
యును । నరకకూపమున బడదలచెదుము । వ్యర్థమగు
త్రోవను విడువందగు ॥నోరోరిరావణా॥

4 కులముబంధువుల నిలుపగనెంచిన । కలుషమతినిద్వ
జయించినన న్నుగొని । యలఘుతేజరామచంద్రుపాద
ము । లందునుంచి శర । ణని బ్రతుకుము ॥ఓరోరి॥

సంపూర్ణము.



శ్రీ సీతారామాంజనేయముద్రాక్షరశాల—రాజమండ్రి.